# చర్మవ్యాధులకు





# అతి గాఢంగా పనిచేసే అమృతాంజన్ డెర్మల్ ఆయింట్‌మెంట్

చర్మవ్యాధులకు ఉపయోగపడే సాధారణ ఆయింట్‌మెంట్లు ఎక్కువగా చర్మం లోపలకు ప్రవేశించలేవు. కాని అమోఘమైన చర్మరోగ నివారణ ఔషధాలు విశిష్టంగా చేరివుండడంచేత అమృతాంజన్ డెర్మల్ ఆయింట్‌మెంటు మాత్రము లోపలకు ప్రవేశిస్తుంది. సాధారణ చర్మవ్యాధులను అతి శీఘ్రంగా నిర్మూలించి చర్మాన్ని పూర్వస్థితికి తెచ్చి సహజంగాను ఆరోగ్యవంతంగాను ఉంచుతుంది.

అమృతాంజన్-డెర్మల్ ఆయింట్‌మెంట్ తామర, గజ్జి, దురద ఇతర చర్మ రోగాలకు ఆదర్శమైన నివారిణి.

నేడే ఒకటి కొనండి!




**అమృతాంజన్ లిమిటెడ్** 14/15 లజ్ చర్చ్‌రోడ్డు, మద్రాసు 600 004

SAA/AM/1906 R TEL

పూవులాంటి పడతి అత్తింట కాలిడితే అన్నీ సమస్యల తోరణాలే



ప్రసాద్ ఆర్ట్ పిక్చర్స్

# అత్తవారిల్లు

నిర్మాత: ఏ.వి. సుబ్బారావు

స్క్రీన్‌ప్లే-దర్శకత్వం: కె. ప్రత్యగాత్మ

సంగీతం: టి. చలపతిరావు

నవయుగ





NVKR

4-2-77

## కథలు

7.1.77 పత్రిక చాల ఆసక్తిదాయకమైన శీర్షికలతోను, కథలతోను వెలువడినందుకు నా ప్రత్యేకాభినందనలు. ముఖ్యంగా ఈ వారం ప్రచురింపబడ్డ మూడు కథలు, చక్కని శైలిలో ఉండి, నా హృదయాన్ని ఆకట్టుకున్నాయి. కలకాలం నిలచిన ఒక ప్రేమకథ, 'ఇంటావిడ మాఆవిడ' రచయితలకు నా ప్రత్యేక అభినందనలు. మనస్సుని రంజింప జేసిన రీతిలో రచించబడిన ఈ కథలలో అంతర్గతంగా గుర్తుంచుకోవలసిన ప్రబోధం ఉన్నందుకు. అల్లాంటి కథలను మీరు ప్రచురించినందుకు నేను మిమ్మల్ని అభినందిస్తున్నాను. శ్రీ పైడిపాటి సుబ్బరామశాస్త్రిగారి సీరియల్ ఆసక్తిదాయకంగా సాగుతుందని ఆశిస్తున్నాను. 'రాలిన ముత్యాలు' శీర్షిక ద్వారా మేలైన ముత్యాలు పంచి పెడుతున్న శ్రీ సోమసుందర్ గార్కి అభినందనలు.

జె. మూర్తి (హైదరాబాదు.)

* * *



7.1.77 సంచిక ముఖచిత్రం 'నాగేశ్వరరావు' చాలా అందంగా వుంది 'కలకాలం నిలచిన ఒక ప్రేమకథ' చల బాగుంది. రత్నగారి పాత్ర చాల బాగుంది. రత్నగారి ఉత్తరం చదివిన కొద్ది బాధ పడ్డాము. పాపం. ప్రేమ నిరాశ అయింది రచయితకు అభినందనములు. సంగీతపుజల్లు కూడ బాగుంది. సీరియల్ మగదిక్కు మొదటిలోనే బాగుంది. ఇంతమంచి సీరియల్ మాకు అందిస్తున్నందుకు సంపాదకునికి అభినందనములు

ఎం. నిశాకర్‌రెడ్డి. బి.ఏ. (కరీంనగర్—2)

* * *

7.1.77 సంచికలో 'కలకాలం నిలచిన ఒక ప్రేమకథ' 'ఇంటావిడ మా ఆవిడ' 'సంగీతపు జల్లు' కథలు చాలా బాగున్నాయి. కార్టూన్లు తమాషాగా ఉంటున్నాయి.

ఆర్. సావిత్రిపుల్లారావు. (నందిగామ.)

## సీరియల్

'వో తార కథ' సీరియల్ చాలా బాగున్నది మాలతి పూర్వ కథ సాఫీగా సాగి పోతున్నది. కార్టూనిస్టు పుల్లారావుగారిది ఒకే కార్టూనయినా కడుపుబ్బ నవ్వు తెప్పించినందుకు వారికి పత్రికాముఖంగా నా అభినందనలు తెలుపుతున్నాను.

పి. వి. రామనాధరావు (నేలకొండపల్లి)

* * *

14.1.77 సంచికలో వో తార కథ మూడవ భాగం చాలా బాగుంది. సీత కథ అందులో చదువుతుంటే రచయిత్రి అంతటి వాస్తవాన్ని ఎలా సృష్టించారో నాకు చాలా ఆశ్చర్యాన్ని కలిగించింది.

పి. వసంత, (విజయవాడ.)

## సంక్రాంతి

14.1.77 ఆంధ్ర సచిత్రవారపత్రిక, ముంగిట సంక్రాంతి ముగ్గుతో ముద్దుగా వుంది. పట్నం బస్సు కథలో తండ్రీ— కొడుకుల మధ్య జరిగిన సంభాషణ సంప్రదాయ జీవన వృత్తికి ఆధునిక జీవన వృత్తికి ప్రతిబింబము. మీ పత్రిక ద్వారా సమాజాన్ని, మేల్కొలిపి, దేశాన్ని ఆర్థికంగా పటిష్టము చేసే రచనలను అందించండి.

చీకటి. జనార్దనరావు, చల్లా. సూర్య ప్రసాద్, (కారుమూరు.)

## హైదరాబాద్ నోట్‌బుక్

హైదరాబాదు నోట్‌బుక్ [14.1.77] లో శ్రీ వి. జగపతిరావు తెలంగాణా ప్రాంతీయ సంఘం అధ్యక్షుడని పొరపాటుపడింది. శ్రీ జగపతిరావు ఆంధ్రప్రదేశ్ కాంగ్రెసు సంఘం ప్రధాన కార్యదర్శి ఆంధ్రప్రదేశ్ కోపరేటివ్ మార్కెటింగ్ ఫెడరేషన్ అధ్యక్షులు.

వి.దా. (హైదరాబాద్)

(49వ పేజీ చూడండి)

# ఆంధ్రసచిత్రవారపత్రిక

వ్యవస్థాపకులు :
దేశోద్ధారక కాశీనాధుని
నాగేశ్వరరావు పంతులుగారు
స్థాపితం : 1908
శివలెంక శంభుప్రసాద్
సంపాదకుడు
[1938-1972]
శుక్రవారం : 4 2-'77
నలనామ సం. మాఘ శు. పౌర్ణమి
సంపుటము 70 : సంచిక : 23

సంపాదకుడు :
శివలెంక రాధాకృష్ణ
*

పోస్ట్‌లో ఏడాది చందా రు. 41-60
" ఆరుమాసాల చందా రు. 20-80
విడి ప్రతి వెల 75 పైసలు
ఆంధ్రపత్రిక కార్యాలయము
గాంధీనగరం, విజయవాడ-520003.


## విషయానుక్రమణిక



అందరికీ 'రిపబ్లిక్‌డే' సందర్భంగా మా శుభాకాంక్షలు —సం.

## లోకం పోకడ — బాపు





# సంఘపురాణం

## కవనశర్మ

### 1 కొత్త సంఘం పుట్టించటం లేక సంఘోద్భవం

ఉపోద్ఘాతం.

మానవులు సంఘజీవులు అందుకని నలుగురు మనుషులొకచోట జేరితే సాంస్కృతిక సంఘాలని, విజ్ఞాన సమితులని, సంపన్నుల క్లబ్బులని, శ్రామికుల యూనియన్లని, భక్త సమాజాలని రకరకాలవి ఏర్పడుతూ ఉంటాయి ఆవిరి, నీరు, మంచు ఒక్క పోలిక నుండవు. కాని చూడజూడ అవి వేరు కాదు అని తెలుస్తుంది. అలాగే ఈ సంఘాలన్నిటి జాడ ఒకటే, పేర్లే తేడా. అవన్నీ ఒకలాగే పుట్టి బతికి బట్టకట్టి, బజార్నపడ్తాయి. కోర్టులకెక్కుతాయి, మట్టికొట్టుకుపోతాయి.

చీమలు పెట్టిన పుట్టలు, ఒక సైజుకి పెరిగాక, చీమల్ని దూరంగా తరిమేసి, పాములు ఆక్రమించి హాయిగా వాడుకుంటాయి. ప్రతి సంఘానికి ఫౌండర్ మెంబర్లు వేరు ఫౌండేషన్ స్టోన్ మెంబర్లు వేరు. రెండో జాతి జనం, ఏదైనా సంఘం కాస్త నిలదొక్కుకుని ఏ భవనమో కట్టుకొందామనుకొంటున్న సమయంలో ప్రత్యక్షమైన శంకుస్థాపన ఫలకంమీద పేరు వ్రాయించేసుకొంటారు.

సంఘాలంటూ ఉంటే వాటికి అధ్యక్షులు కార్యదర్శులు అంటూ పదవులుంటాయి. ఆ పదవుల కోసం జన్మించిన కారణజన్ములుంటారు. వీరికి సంఘాల అవసరం ఎంతైనా ఉండటం చేత, సంఘాల్లేకపోతే వీరి జీవితం దుర్భరం కనుక వీరిని సంఘజీవులనవచ్చు. మనుషులు సంఘ జీవులు. కనుక వీరే నిజమైన మనుషులు వీళ్ళు కాని వాళ్ళు సాధారణ సభ్యులు. వీరు సంఘాల్ని నడిపించేవారు వారు(సాధారణ సభ్యులు)నడిచేడు వారు. వీరి లీలలే ఈ పురాణం ఈ రచన వీరిగురించి, వీరికోసం కనుక, వీరికే అంకితం.

* * *

అదో పెద్ద ఊరు. ఆ ఊరు ఆంధ్రదేశానికి దూరంగా ఉంది. అందుకని ఆ ఊళ్ళో ఆంధ్రులకి ఒకళ్ళంటే ఒకళ్ళకి అభిమానం ఉంది. అందరికి కలిసి తెలుగంటే తగని అభిమానం.

ఆ ఊళ్ళో చీమల పేటని ఓ పేటుంది అక్కడ పూర్వం మనుషులిళ్ళు కట్టక పూర్వం కాలు మోపడానికి వీల్లేనన్ని చీమల పుట్టలుండేవని అందుకే ఆ పేటకాపేరు వచ్చిందని, ముసలివాళ్ళు మనవలకి చెపుతూ ఉంటారు. అయితే ఆ ఊళ్ళో ఉద్యోగరీత్యా వచ్చి ఆ పేట అద్దె ఇళ్ళలో అమరిపోయిన వాళ్ళు "ఇక్కడుంటున్న జనం చీమలలాంటి సన్నకారు జనం. కోపం వచ్చినప్పుడు అరవటం తప్ప ఏం చెయ్యలేరు. చీమలు కుట్టడంవల్ల చీమలకే ప్రమాదం అయినట్టు అరవటం వల్ల వీళ్ల గొంతుకలే పోయే ప్రమాదం వీళ్ళకే. అందుకని దీన్ని చీమల పేట అన్నారు" అంటూ చెప్పుకుని ఆనందిస్తూ ఉంటారు.

అటువంటి పేటలో రంగారావున్నాడు. అతను యూనివర్సిటీలో చదువుకొనే రోజుల్లో నాటకాలు వేసేవాడు అనేకంటే యూనివర్సిటీలో నాటకాలు వెయ్యటం కోసం తప్పని సరిగా చదువుకునేవాడు అనటం న్యాయం అతనికా ఊరు వచ్చినప్పటనుంచి తోచడం లేదు. ఎక్కడైనా కాస్త ఎత్తైన అరుగు కనిపిస్తే "ఇది మాతం స్టేజిగా ఎందుకు పనికి రాదు! నాలుగు దుప్పట్లు కడితే సుబ్బరంగా పనికొస్తుంది" అనుకునేవాడు అక్కడ చుట్టుపట్ల ఎవరూ లేకపోతే ఒక రెండు డైలాగులు ఆ అరుగు మీద నిలబడి చెప్పేవాడు. అటువంటి రంగారావుకి ఆ ఊళ్ళో ఉద్యోగంరావటం ఈతరాని వాడిని చెరువులో పడేసినట్టుగా, చేపని గాల్లో విసిరేసినట్టుగా పల్లెటూరివాడ్ని బొంబాయిలో పడవేసినట్టుగా, బొంబాయి వాడ్ని పల్లెటూర్లో పడవేసినట్టుగా ఉంది. ఎందుకంటే ఆ ఊళ్ళో ఎవరికి తెలుగు నాటకాలను ప్రదర్శించడం పట్ల ఆసక్తి లేదు.

రంగారావు ఓపిక పట్టినన్నాళ్ళు ఓపిక పట్టి ఒకరోజున తన యీడు వాళ్ళని తనకి తెలిసిన వాళ్ళని తన యింటికి టీకి పిలిచి "మీరు తీరిక సమయాల్లో ఏం చేస్తూ ఉంటారు?" అని అడిగాడు. కొంతమంది పెళ్ళాల్తో కబుర్లు చెప్తాం అన్నారు. మరి కొందరు డబ్బుపెట్టి పేకాడ్తాం అన్నారు. కొందరు ఉత్సాహవంతులు "మా తీరిక సమయాల్లో... సాయంత్రాలు ఏమీ చెయ్యం... ఏం చేసినా చీకటి పడ్డాకనే ఏం కథ? మీరూ మాతో చేర్తారా?" అని అడిగారు.

ఓ నలుగురు మాత్రం "ఏం చేస్తే బావుంటుందంటారు?" అని అడిగారు.

రంగారావు చెప్పాడు "మనం ప్రతినెల మొదట్లోను ఒక నాటకం వేద్దాం. దానికి

ఆ క్రితం నెలంతా రిహార్సల్స్ వేసుకొందాం"

"మనం నాటకం వేసేమే అనుకోండి గురువుగారూ! కాని అదెవరు చూస్తారు?" అని అడిగాడు వెంగన్నారావు. అప్పటికే వెంగన్నారావుకి నాటకం వెయ్యాలన్న ఉత్సాహం కలిగింది ఎవరైనా ఏదైనా చెప్తే వాళ్ళతో వెంగన్నారావు త్వరగా ఏకీభవించ గలడు; ఉత్సాహంగా ముందుకి రాగలడు.

"టికెట్టు లేకుండా రానిస్తే చాలా మందే వస్తారు నాటకాన్ని చూడటానికి. కనీసం చదువులు మానేసి పెళ్ళి కోసం కాచుకొని ఇంట్లో కూర్చున్న ఆడపిల్లలు కాలక్షేపం లేక, ఇల్లాంటి వేషున్నా ఉంటె పరిగెత్తు కొచ్చేస్తారు. వాళ్ళ గురించి హుషారైన మగపిల్లలొస్తారు. వాళ్ళనుంచి వాళ్ల అమ్మాయిల్ని కాపాడుకోడానికి ఆ ఆడ పిల్లల బాబులు వారితోబాటు వారి భార్యలు, కొండొకచో తల్లులు వస్తారు. ఇటు మగ పిల్లల తలి దండ్రులు, వారి సుపుత్రులెవరి వలలోనైనా పడి "కానీ కట్నం లేకుండా పెళ్ళాడేస్తామ"ని ప్రమాణాలు చేస్తారేమోనన్న బెంగతో వస్తారు. అందు చేత మన నాటకం చూడటానికి బోలెడు మంది జనం వస్తారు" అన్నాడు రంగారావు.

"నిజమే నండోయ్" అంటూ ఏకీభ వించాడు వెంగన్నారావు. అల్లా వెంటనే ఏకీభ వించిన వెంగన్నారావు "మరి నాటకం వెయ్య టానికి స్థలమో?" అంటూ అది సంపా దించడం కష్టం అన్న సందేహం వెలిబుచ్చాడు.

"రవీంద్ర భారతి. ఆ హాళ్ళు, అంటే కష్టం గని, మన ఏమల పేటలో నాటకం వేసుకొనే వీల్లేకపోలేదు. పక్కనే ఉన్న అప్పర్ ప్రైమరీ స్కూల్లో మనం నాటకాలు వెయ్యొచ్చు. ఎలక్ట్రిసిటీ ఛార్జీలు. కర్టెన్ల అద్దె, హాలు అద్దె కలుపుకొని, నలభై రూపాయలు, కుర్చీలు, మైకులు ఉండవు మనం ఇళ్లనుంచి జంబుఖానాలు తెచ్చి వెయ్యొచ్చు. మైకుల అవసరం లేకుండా గొంతు పెంచి సంభాషణలు చెప్పొచ్చు. మధ్యలో మైకులు ఫెయిల్ అవటం అంటూ ఉండదు" అన్నాడు రంగారావు.

"మరేనండోయ్. మైకులు లేకపోవటం ఒక పెద్ద నావెల్టీ మన నాటకాలకి. మరి మేకప్...?...ఆ...దాన్దేముంది లెండి మనమే చేసు కొందాం. కాని ప్రతి నెల నలభై రూపాయలు ఎక్కడి నుండి వస్తాయి?" అని అడిగాడు రంగారావు.

"ఎవర్నన్నా ఊళ్లో డబ్బున్న పెద్దవాళ్లని

# ప్రారంభం!

పోషకులుగా పెట్టుకొందాం" అన్నాడు అంత వరకు నోరు విప్పని రెడ్డి. అతనికి మనం అడగాలేగాని డబ్బున్న పెద్దవాళ్లు డబ్బిచ్చే స్తారని వాళ్ళు అందుకే భూమ్మీదున్నారని నమ్ముతాడు. అంటే 'డబ్బిచ్చేస్తారు కనక అని కాదు డబ్బివ్వటానికే' అని.

"వద్దు. డబ్బున్న వాళ్ళెవరు వాళ్లకి ప్రయోజనం లేకుండా పది పైసలు కూడా ఖర్చుపెట్టరు. మనమే తలో ఆయిదు వేసుకొని..." అని రంగారావు చెప్తుంటే "చేత్తుమురు భాగోతం ఆడ్దామంటారా?" అని కోపంగా అడిగాడు రెడ్డి.

"అది కాదు నా ఉద్దేశం. మనం ఇచ్చేది సభ్యత్వపు చందా. నాటకం నాడు పళ్లెం తిప్పుదాం. సభ్యుల్ని చేర్చుకొందాం. ఆ విధంగా మనం చేతి చమురు భాగవతం ఆడాల్సిన అవసరం ఉండదు. అందుకని మనమంతా మన చందాలు కట్టేస్తే అది మూలధనంగా పెట్టి మొదట నాటకం వెయ్యొచ్చు. ఆ నాటకం చూసాక చాలా మంది మన సంఘంలో సభ్యులవుతారని నా నమ్మకం" అన్నాడు రంగారావు.

సమావేశానికి వచ్చిన వాళ్లందరు దాన్ని ఆమోదించారు.

పక్షం తిరిగేసరికి అప్పర్ ప్రైమరీ స్కూల్ ఆవరణలో రంగారావు, రెడ్డి, వెంగన్నారావులు వాళ్ల బృందంతో కలిసి నాటకం ఆడారు. ఇద్దరు, పెళ్ళికాని చాకుల లాంటి అమ్మాయిల్ని బతిమాలి, వాళ్ళ చేతు లకి పళ్ళాలిచ్చి జనం మీదకి పంపారు. వాళ్ళకి



కావస్తే మా పెరటివేపు అరుగులు మీ నాటకాలకు వాడుకోవచ్చు! ఇదే నాకు తోచిన ఉచిత సహాయం!

తెలిసిన వాళ్ళు తెలుసు కనుక తెలియని వాళ్ళు మొహమాటానికి, కొందరు అడుగుతున్న వాళ్ళు ఆడపిల్లలని తలో పావలా అర్ధా వేసారు. నలభై రూపాయలు వసూలైంది. ఆ వూళ్లో అన్ని సంవత్సరాలుగా ఎవరూ తెలుగు నాటకం చూసెరగరు. అందుకనీ అందరికి ఆ నాటకం నచ్చింది.

నాటకం వేసిన తరువాత మొదటి ఆది వారం రంగారావు, రెడ్డి. వెంగన్నారావు నాట కానికి వచ్చిన వారిలో వారికి తెలిసిన వారిని సభ్యులుగా జేరమని, వారిళ్ళకి వెళ్ళి కోరారు. ఆ విధంగా ఓ యాభై మందిని సభ్యులుగా జేర్చు కొన్నారు.

దాంతో రెండో నాటకాన్ని మైకులు, ఫ్లడ్ లైట్సు లాంటి హంగులతో ప్రదర్శించ కలగారు ఈ సారి తాము గూడా పళ్ళాలు పుచ్చుకొని హడావిడిగా అటూ ఇటూ తిరు గుతూ అందరి ముందర మెరిసిపోవాలన్న కోరి కతో అప్పటి కప్పుడు కావాలంటే పళ్ళాలుం టాయి ఉండక పోతాయని తమ వెంట పళ్ళాలు తెచ్చుకొన్న అమ్మాయిలు, నిరాశ పొందారు. అల్లా నిరాశపొందిన అమ్మాయిలలో ఒక అమ్మాయి తల్లి పద్మావతిదేవి. "మీకు కావా లంటే మా అమ్మాయి పళ్లెం తిప్పి పెడుతుంది. అక్కర్లేదంటే మీ ఖర్మ" అంటూ కబురు పెట్టింది. పద్మావతికి సంఘ కార్యకలాపాల పట్ల బోలెడు ఆసక్తి, కూతురు పెళ్ళి పట్ల కొంచెం ఆత్రుత ఉన్నాయి. అందుకని ఆ పిల్లని వీలైనంత వరకు నలుగురి దృష్టిలోకి తెస్తూ ఉంటుంది. ఆ విధంగా చేస్తూ పోతుంటే ఏదో ఒకరోజు, ఎవరో ఒక రాజకుమారుడు ఎంచక్కా ఆ పిల్లని విమానం ఎక్కించు కొని విదేశాలకి తీసుకు వెళ్తాడు ఈ లోపల తను పెళ్ళి జరిపించేస్తుందని, నమ్ముతుంది. పద్మావతిదేవి భర్త, పద్మావతిదేవి నమ్మిం దంతా నమ్ముతాడు. ఇంతకూ ఆ రోజు రంగారావు పళ్లెం తిప్పి పటాని కిష్టపడక, వచ్చే ఆదివారం తాము అందర్ని కలుసు కొంటామని అప్పుడు అందరు సభ్యులుగా చేరితే తాము సంతోషిస్తామని మైకులో చెప్పాడు తప్పి తప్పకుండా కలుసుకోమని కబురు పెట్టింది పద్మావతిదేవి. రంగారావు, రెడ్డి, వెంగన్నారావు ఆ విధంగా మరో నాటకం ఆడారు. (ఇంకా ఉంది)

# అస్పృశ్య నయనాలు

వసుంధర




ఈ ప్రపంచంలో నేను మనస్ఫూర్తిగా కేవలం రెండంటే రెండింటినే ప్రేమిస్తాను. సాధారణంగా ఎవరైనా తమకు అందుబాటులో లేనివే ప్రేమిస్తారంటారు. అదెంతవరకూ నిజమో నాకు తెలియదుకానీ— నా ప్రేమకు నోచుకున్న రెండింటిలో ఒకటి మాత్రం నాకాట్టే అందుబాటులో లేదని చెప్పవచ్చు. అదే డబ్బు.

నా అదృష్టం కొద్దీ నేను పొరుగూరో ఉండి చదువుతున్నాను—కానీ లేకపోతే సిగ్గులో సగం చచ్చి ఉండేదాన్ని. నేను మామూలు చీర కట్టినా గొప్పవాళ్ళ అమ్మాయిలాగే కనబడతాను. అది నాశరీరపు ఒంపుసొంపుల అమరికలోనూ, నాముఖ సౌందర్యంలోనూ ఉంది. మాఊళ్ళో కాలేజీలేదు. చదువుకున్న అమ్మాయంటే కట్నం తగ్గుతుంది కాబట్టి—నన్ను చదివించాలని నాన్నగారి ఉద్దేశ్యం. పొరుగూర్లో కాలేజీఉంది బాగాడబ్బున్న అత్తయ్య ఉంది. ఆమె దగ్గర అంతులేని అభిమానం కూడా ఉంది ఇవన్నీ చేరినాకు కాలేజీ యోగంతో పాటు రాజయోగం కూడా పట్టినాయి.

అత్తయ్యకు ఆడపిల్లలు లేరు. ముగ్గురు మగపిల్లలున్నారు. అందరికంటె పెద్దవాడు నా కంటె మూడేళ్ళుచిన్న. అత్తయ్య ఇంట్లో ఒక రాజకుమారిలా కాలం గడిపాను. అత్తయ్యకు నేనంటే వింతో మోజుకావడం అందుకు కారణం.

అత్తయ్యకు ఆడపిల్లలు లేకపోవడం తాత్కాలికంగా ఒక వరమైంది నాకు. కన్నకూతురి కంటె అబ్బురంగా చూసేది అత్తయ్య నన్ను. అది ఒక విధంగా నాకుచాలా ఆనందం కలిగించింది. నేనులేని వాళ్ళ అమ్మాయినని ఎవరూ అనుకోలేదు. హాస్టల్లో చేరడానికి డబ్బులేక—అత్తయ్య ఇంట్లో నేనుంటున్నా నన్న విషయం కనీసం అత్తయ్యకు కూడా తెలియదు.

నా మనస్తత్వానికిది బాగా సరిపడింది. నాకు దరిద్రమంటే అసహ్యం. డబ్బు అంటే పిచ్చి ప్రేమ. డబ్బును మంచినీళ్ళలా ఖర్చుపెట్టే స్థాయికి ఎదగాలన్నది నా ఆశయం. నాసౌందర్యానికి దాసోహమని ఏలక్షాధికారి కొడుకైనా నన్ను ప్రేమిస్తాడనీ ప్రేమించి పెళ్ళి చేసుకుంటాడనీ నాకు ఆశకూడా ఉంది. ఆ ఆశనమ్మకంగా మారే అవకాశం శేషగిరి పరిచయంతో కలిగింది.

శేషగిరి నా వెంట పడుతున్నట్లు నేనెప్పుడో పసిగట్టాను. అయితే ఆవిషయం అతనికి తెలియదు. కానీ అతను నావెంట పడడం నాకు ఇష్టమే! ఎందు కంటే అతను చాలా అందంగా ఉంటాడు. మసిలే పద్ధతిని బట్టి అతను చాలా సంపన్నుడని ఇట్టే ఊహించవచ్చు. అయితే అతనంటే నేనిష్టపడడానికి ముఖ్యకారణం అతని కళ్ళు. అన్నట్టు చెప్పడం మరిచిపోయాను నే నీ ప్రపంచంలో ప్రేమించేది రెండేరెండింటినన్నాను కదూ ఒకటి డబ్బు—రెండు - అందమైన కళ్ళు.

భగవంతుని సృష్టిలో కంటికి మించి అపూర్వమైన దేదీ మరిలేదని నా దృఢ విశ్వాసం. అయినా అందరికళ్ళు అందంగా ఉండవు. కానీ మనిషి అందం చాలావరకు కళ్ళలోనే ఉన్నదని నిర్వివాదాంశం. నేనేమనిషి నయినా కళ్ళుమాత్రం చూసి అంచనావేస్తాను. మనిషి భావాలు కళ్ళలో— ప్రతిఫలిస్తాయిగదా చెడ్డవాడికళ్ళు చెడ్డ చూపులుచూస్తాయి.చెడు చూపులు కంటి అందాన్ని పాడుచేస్తాయి. అందమైనకళ్ళంటే దుర్మార్గుడు కాలేడన్నది నా సిద్ధాంతం. అందమైన కళ్ళున్నవారు ఏతప్పుచేసినా నేను సహిస్తాను.అందుకే నామూడో తమ్ముడూ, రెండో చెల్లెలూ ఎన్నడూ తప్పుచేసినట్లు అనిపించదు నాకు. నాన్నగారు కానీ అత్తయ్యగానీ తప్పు చేస్తారనిపించదు నాకు. అందమైన కళ్ళున్న వాళ్ళను ప్రేమిస్తాను నేను. మరి శేషగిరివీ- అందమైన కళ్ళు! ఎంత అందమో మాటల్లో వివరించలేనంత అందమైనకళ్ళు!

సంపన్నుడైన శేషగిరికి అందమైన కళ్ళున్నాయి. ఇంతకంటె జీవితంలో కోరుకోవలసినదేముంది నాకు. ఆ శేషగిరి నా పరిచయాన్నభిలషించగానే- నేను వెంటనే అందకుండా

ఒక క్రమపద్ధతిలో అతనితో స్నేహం పెంచసాగేను. మా స్నేహం నెమ్మది నెమ్మదిగా ప్రేమగా మారసాగింది. నేను క్లాసులు ఎగవేసి శేషగిరితో సినిమాలకు వెళ్ళాను. స్నేహితురాలింటికి అని అత్తయ్యకు అబద్ధం చెప్పి అతన్ని పార్కులో కలుసుకున్నాను. అతన్ని హద్దుల్లో ఉంచడానికి నేను ప్రత్యేకంగా ఏమీ అవస్థ పడనవసరం లేకపోయింది. శేషగిరి చాలా బుద్ధిమంతుడిలా ప్రవర్తించేవాడు. మరి అతనివి అందమైన కళ్ళు అతని ప్రవర్తన అందంగా ఉండక మరెలా ఉంటుంది?

శేషగిరి నాకోసం డబ్బు మంచినీళ్ళలా ఖర్చు పెట్టేవాడు. అతనలా ఖర్చు పెడుతూంటే నాకు చాలా ఆనందంగా ఉండేది. నాకోసం ఖర్చు పెడుతున్నాడన్న ఆనందం కంటె — అతనికి డబ్బంటే లక్ష్యం లేదన్న విషయమే నాకెక్కువ ఆనందం కలిగించేది. అందువల్లనే నా అలవాట్లన్నీ అతనిదగ్గర చాలా ఖరీదైనవిగా ఉండేవి. ఐస్‌క్రీమ్ తప్ప తినేవాణ్ణికాడు. కూల్ డ్రింక్ తప్ప తాగేవాణ్ణి కాదు. టాక్సీలోతప్ప ఎక్కేదాన్నికాదు.

పిల్లి కళ్ళు మూసుకుని పాలు తాగినంత మాత్రాన ఇతరులకు కనబడకుండా పోదు. మా పరిచయాన్ని రహస్యంగా ఉంచడానికి మేము చేసిన ప్రయత్నాల విలువ అంత మాత్రమే అయింది. ఒకరోజు అత్తయ్య నన్ను ప్రేమగా పక్కగదిలోకి పిలిచి — అక్కడ ముఖం వాచేలా నానాచివాట్లూ పెట్టింది. అంతవరకూ అత్తయ్య ప్రేమను మాత్రమే చవిచూసిన నేను హడలిపోయాను. అత్తయ్య నామీద కోపపడగలదనీ, అందులోనూ అంత దారుణంగా కోపపడగలదనీ ఆరోజే నాకు అర్థమైంది.

"నువ్వెంతో మంచిదానివనుకున్నాను, అమాయకురాలివనుకున్నాను. అందుకే మీనాన్న చెప్పిన వెంటనే నిన్ను మా ఇంట్లో ఉంచుకునేందుకు ఒప్పేసుకున్నాను. కానీ నువ్విలా ప్రవర్తిస్తావనీ, నా పరువు తీస్తావనీ, మీ నాన్నకు సమాధానమిచ్చుకోవలసిన స్థితికి నన్ను లాగుతావనీ నేననుకోలేదు అన్నది ఆమె చీవాట్లలోని సారాంశం. నాకు జవాబు ఏం చెప్పాలో తెలియలేదు. ఏడుస్తూ కూర్చున్నాను. తిట్టి తిట్టి అలిసిపోయి అత్తయ్య నెమ్మదిగా దగ్గరకువచ్చి తల నిమిరింది. నాకింకా ఎక్కువ ఏడుపువచ్చి అత్తయ్య ఒడిలో వాలి బావురుమన్నాను. ఈసారి అత్తయ్య నన్ను ఓదార్చింది.

"పిచ్చిపిల్లా నీ బాగుకోరేదాన్ని కాబట్టి ఇలా కఠినంగా మాట్లాడవలసి వచ్చింది. యుక్తాయుక్త జ్ఞానం తెలియని వయసు కాబట్టి నువ్వు తప్పుదారిన నడుస్తున్నావు. నువ్వు అమాయకురాలివని నాకు తెలుసు. అందుకే నా బాధ..." అన్నది ఆమె ఓదార్పులోని సారాంశం.

తర్వాత నెమ్మదిగా అత్తయ్య నా దగ్గర్నుంచి వివరాలు రాబట్టింది. అతనెవరో తెలుసుకుంది. నేను హద్దులు అతిక్రమించ లేదని రూఢి చేసుకుంది. ఇకమీదట అతనితో తిరగవద్దని హెచ్చరించింది. అన్నింటికీ మౌనంగా తల ఊపాను.

ఆ తర్వాత నిజంగానే నేను కొన్నాళ్ళపాటు శేషగిరిని తప్పించుకు తిరిగాను. నేనెందుకలా తప్పించుకు తిరుగుతున్నానో తెలియని శేషగిరి చాలా కలవరపడి ఉండాలి. ఈ విధంగా అతనికి నాపట్ల ఆకర్షణ పెరిగి కూడా ఉంటుంది. ఈ రకమైన ఆలోచనలతో నన్ను నేను తృప్తి పరచుకుని — శేషగిరికి అందకుండా పోసాగాను అయితే ఒక రోజు నేను కాలేజీ నుంచి యింటికి వచ్చేసరికి — శేషగిరి మా యింట్లో ఉన్నాడు. "ఎంత ధైర్యం!" అని ఆశ్చర్యపోయాను. అత్తయ్య ఏమంటుందో నన్న బెదురు కూడా కలిగింది. అయితే అత్తయ్యే అతన్నక్కడికి రప్పించిందన్న విషయం నన్ను విశ్మయ్యురాలిని చేసింది. అత్తయ్య ఎంత మంచిది?

అత్తయ్య శేషగిరితో చాలాసేపు మాట్లాడింది. అంతసేపూ నేను వంటింట్లో వున్నాను. ఆ ప్రాంతాలకు వెళ్ళడానికి నాకు సిగ్గేసింది. చాలాసేపు తర్వాత అత్తయ్య వంటింట్లోకి వచ్చి "అతను వెళ్ళిపోయాడు" అంది. "అయ్యో!" అనిపించింది కానీ పైకి అనలేక పోయాను. అత్తయ్య ముఖంలో చిరునవ్వులు చిందాయి. "ఈ రోజుల్లో కులం, మతం అంటూ పట్టుకు వేళ్ళాడ్డం చాలా తెలివి తక్కువ పని. మీ నాన్న ఏమంటాడో నాకు తెలియదు కానీ కుర్రాడు యోగ్యుడని నాకు అనిపించింది. ఏమో అనుకున్నాను కానీ నువ్వు తెలివైన దానవే! మంచివాణ్ణే వెతుక్కున్నావు."

నాకు సిగ్గేసింది. ఏం మాట్లాడలేదు.

"మీ నాన్నను ఒప్పించడానికి నా శాయశక్తులా ప్రయత్నిస్తాను. ఒప్పుకోక పోవడానికి మాత్రం ఇందులో ఏముందిలే — అతనికి నా అన్నవాళ్ళెవరూ లేరు. నెలకు అయిదొందలకు పైగా వచ్చే ఉద్యోగం ఉంది. అన్నింటికీ మించి మనిషి చాలా మంచివాడు. కట్నం అక్కరలేదట. పెళ్ళి చేసుకోవడం కోసమే నీతో పరిచయం చేసుకున్నాడు" అంది అత్తయ్య మళ్ళీ.

పిడుగు పడ్డట్టు ఉలిక్కి పడ్డాను అతనికి నెలకు అయిదొందల రూపాయల జీతమా? అతనుద్యోగం చేస్తున్నాడా? ఉద్యోగం చేయవలసిన అవసర మేమిటి? సరదాకు, ఉబుసుపోకకు చేస్తున్నాడనుకుందామన్నా — అంత చిన్న ఉద్యోగం ఎలా చేస్తున్నాడు? ఇందులో ఏదో మోసముంది.

అతను నాతో రెండు కార్లున్నాయనీ అమ్మానాన్నా పెద్దవాళ్ళు తనకని అందు బాటులో ఉంచరనీ, తన తల్లిదండ్రులు పెద్ద వ్యాపారస్తులనీ చెప్పాడు. అతనికి నా అన్నవాళ్ళెవరూ లేరని అత్తయ్య అంటోంది.

"అతనిది మన కులం కాదా అత్తయ్యా" అన్నాను నెమ్మదిగా.

"కాదు. అయితే యేం..." అనిఅత్తయ్య ఏమో అనబోయింది.

"నన్ను బాగా ఆలోచించుకోనీ అత్తయ్యా మాది పెద్ద కుటుంబం. నాకింకా పెళ్ళి కావలసిన చెల్లెళ్ళున్నారు —" అని అక్కణ్ణుంచి వెళ్ళిపోయాను, మర్నాడతన్ని కలుసుకుని నిలదీయాలన్నది నా ప్రస్తుతాశయం.

అనుకున్నట్లుగానే మధ్యాహ్నం కాలేజీ గేటు దగ్గర అతను కనిపించేడు. మాట్లాడకుండానే అతన్ననుసరించాను. అతను టాక్సీ వైపు వెళబోతూంటే "వద్దులే - నడిచే వెడదాం" అన్నాను. ఇద్దరం ఒక పార్కులోకి చేరాం.

## అమెరికాలో పనికిరాని సామాన్లు

అమెరికాలో ప్రతి సంవత్సరం ఎన్ని కారులు పనికిరానివిగా వదలివేస్తారో తెలుసా? 70 లక్షల కారులు - అంతే కాదు 550 లక్షల క్యానులు, 2600 కోట్ల సీసాలు — 65 కోట్ల సీసా మూతలు — కూడా వదలివేస్తారుట!

"ఎందుకు నాకు అబద్ధం చెప్పావ్?" అన్నది నా మొదటి ప్రశ్న.

"మీ క్లాస్‌మేట్ అరుణ నాకు బాగా తెలుసు. వాళ్ళ ఇంట్లోనే నే నద్దెకుంటు న్నది. నిన్ను గురించి ఆమె ద్వారానే తెలుసు కున్నాను. తన క్లాసులో అప్సరస లాంటి అమ్మాయుందనీ దరిద్రమన్నా, పేదవాళ్లన్నా ఆమెకు అంతులేని అసహ్యమనీ ఆమె నాకు చెప్పింది. కుతూహలం కొద్దీ నిన్ను చూసి ప్రేమలో పడ్డాను. నువ్వులేకపోతే బతకలేననిపించింది. నీతో పరిచయం చేసు కోవాలంటే ధనవంతుడిలా నటించడమొక్కటే మార్గమనిపించింది. అందుకే అబద్ధం చెప్పాను

నాశరీరం కుతకుతలాడిపోయింది "పేద వాళ్ళంటే నాకు అసహ్యమని తెలుసు. ఎప్పటి కైనా నీసంగతి నాకు తెలుస్తుందని తెలుసు అలా ఎందుకు చేశావు......"

అతను తాపీగా నవ్వాడు "నేను పేదవాడిని కానే. నెలకు అయిదొందలు దొరికే ఉద్యోగ ముంది. డబ్బుదుబారా చేసే చెడు అలవాట్లు లేవు. వెనకాముందూ ఎవరూ లేరు. పెళ్లిళ్ళ బజార్లో నాకు చాలా విలువ ఉంది. పదివేలకు మించి కట్నంకూడా పలుకుతుంది. నేను లక్షాధికారిని కాకపోవచ్చు. కానీ పేదవాడిని మాత్రం కాదు"

"కావచ్చు కానీ జీవితం గురించి నేనుకన్న కలలువేరు కార్లలో ప్రయాణం, క్లబ్బుల్లో విహారం అనుదినంచూపెంచు. నగల షాపులో అడుగుపెట్టగానె నమ్రతగా ఒరిగిపోయే మనుషులు- ఇంట్లో పనివాళ్ళు.... ఎన్నని

# అస్పృశ్యనయనాలు

చెప్పను నా కలలన్నీ నీకళ్ళలో ప్రతిఫలించాయి. మోసపోయాను"

"అలా అనకు సుమా! మనం ఒకరినొకరు ప్రేమించు కున్నాం. మనకున్న సౌకర్యాలతో ఎంతో హాయిగా జీవితం గడపవచ్చు. నీకోరిక లకు కారణం నీబుద్ధి ఇంకా వికసించకపోవడం నీకోరికల్లో సుఖంలేదు. నేనాడిన అబద్ధాలకు నన్నుక్షమించు. నీప్రేమను పొందడం కోసమే అబద్ధమాడాను నేను. ఒకసారి నీప్రేమలభిం చాక నేను చేసిన ఎంత పెద్ద తప్పునైనా క్షమించగలవని నా నమ్మకం. అందమైన నీకళ్ళలో ఒక్కసారి నాపట్ల ప్రేమ, జాలి ప్రతిఫలించనీ' అన్నాడతను జాలిగా ముఖంపెట్టి.

ఆక్షణంలో నాకు అతని పట్ల అంతులేని అసహ్యం కలిగింది. మొట్టమొదటి సారిగా నేను ఒక అందమైన కళ్ళున్న వ్యక్తి చేసిన తప్పును క్షమించలేక పోయాను. అంతేకాదు ఆకళ్ళున్న ముఖాన్నిద్వేషించడం కూడా ఆరం భించాను. 'కళ్ళు చూసి మోసపోరాదు' అను కున్నాను అతని వంక సూటిగా చూశాను. నాముఖం చూస్తూనే అతనిముఖం వివర్ణమై పోయింది.

"సుమా! అలాచూడకు. నీకళ్ళు ప్రేమను తప్ప మరేమీ ప్రసరించ లేవనుకున్నాను. వాటిల్లో ఇప్పుడు ద్వేషం, అసహ్యం కనబడు తున్నాయి. అదినేను భరించలేను. నీకంటికి అవినప్పలేదు. నీ అందానికి అదిమచ్చగా ఉండి

పోయింది ప్లీజ్‌సుమా! అలా చూడకు"అన్నా డతను.

అందమైన నాకళ్ళలో ద్వేషమూ ? అసహ్యమా? ఎందుకో ఉలిక్కి పడ్డమాట మాత్రం నిజం. కానీ అతనివంక అలాగే చూడసాగాను. అతనక్కణ్ణించి లేచి వెళ్ళి పోయాడు.

నామనసు పాడై పోయింది. అంతే చిందర వందరగా ఉంది. అతను నాకళ్ళలో ద్వేషాన్నీ అసహ్యాన్నీచూశాడు. అందమైన నాకళ్ళకు అవినప్పలేదన్నాడు. ఆదృశ్యం సహించలేక వెళ్ళిపోయాడు.

అయితే నేనెంతగానో ప్రేమించే కళ్ళలో ఏవిశేషమూలేదా? పరిస్థితుల ప్రభావానికిలోనై ఎంత అందమైన కళ్ళయినా అన్నికళ్ళలాగే మారిపోతాయా?

నేను మంచి దనుకున్న కళ్ళు నన్నుమోసం చేశాయి. అందమైన వనుకున్న నాకళ్ళలో అసహ్యం, ద్వేషం కూడా ప్రతి ఫలించబడింది కళ్ళు మనిషి శరీరంలోని ఒక భాగం మాత్రమే. మెదడు ఇచ్చే ఆజ్ఞల ననుసరించి అవిప్రవర్తిస్తాయి.

తర్వాత శేషగిరి నాకు రెండుత్తరాలు రాశాడు. ఎన్నోసార్లు నన్ను కలుసుకుందుకు ప్రయత్నించాడు. నేను లేకపోతే తను బ్రతక లేడుట. కఠినత్వం వహించక తన్ను వివాహం చేసుకోవాలిట. నేను తనకు అండగా వుంటే ఎన్ని కష్టాలైనా పడి నేను కోరిన సంపదను కూడా సాధించగలడుట,

నేనూ అతనికి ఉత్తరం రాశాను. నన్ను మరచి పొమ్మనీ, ఏ పరిస్థితుల్లోను అతన్ని వివాహం చేసుకోవడం జరగదనీ కొన్ని సంవత్స రాల పునాదితో ఏర్పడ్డ నా కలలు చాలా బల మైనవనీ అవి తప్పక ఫలిస్తాయన్న నమ్మకం నాకున్నదనీ, ఫలించకపోతే కన్యగానైనా ఉండి పోతా తప్ప వివాహం చేసుకోననీ రాశాను.

నా స్వభావం నాకు తెలుసు. నా ఆర్థిక అర్హతలను బట్టి చూస్తే శేషగిరి చాలా మంచి వరుడు. అలాంటి సంబంధం దొర కడం నాకు చాలా కష్టం. కానీ ఏం చేయను— ఎందువల్లనో డబ్బును నేను ప్రేమిస్తాను. అలాగే అందమైన కళ్లలో ఏ విశేషమూ లేదని తెలిసి కూడా వాటిని ప్రేమించ కుండా ఉండలేక పోతున్నాను. బహుశా అది నా బల హీనత. ఆ రెండింటినీ ప్రేమించకుండ ఉండలేను నేను.



బియ్యే ప్యాసు కాగానే ఉద్యోగం దొరికింది నాకు. అయితే ఇప్పుడు నేను అత్తయ్యఊళ్లో ఉండడం లేదు. ఒక పెద్ద సిటీలో ఉంటున్నాను. కార్లలో తిరగాలని కలలు కంటూ నెలకు అయిదు వందలు సంపాదించే ఉద్యోగం గల మగవాడిని వదులుకున్నాను నేను. కానీ ఇప్పుడు నా కొచ్చే జీతం మూడు వందల యాభై మాత్రం. అయినా నేను కలలు కనడం మానలేదు. వీలైనంత దర్జాగానే జీవితం గడుపుతూ నెలకు ఎనభై రూపాయలు ఇంటికి కూడా పంపుతున్నాను. అయితే తరచుగా ఇంటికి వెళ్లను నేను. దారి ఖర్చులకు భయపడి కాదు. మా ఇంట్లోని దరిద్రానికి భయపడి.

అలాగని మా ఇంట్లో దరిద్రం విలయ తాండవం చేస్తుందనుకునేరు. నా ఆలోచనల అంతస్తు వేరు. ఆ అంతస్తులోంచి చూస్తే శేషగిరి దరిద్రుడు. మాదీ దరిద్ర కుటుంబం.

ఏ విధమైన విశేషాలూ లేకుండా రెండు సంవత్సరాలు గడిచిపోయాయి. అప్పుడు హఠాత్తుగా నా జీవితం అనుకోకుండా గొప్ప మలుపు తిరిగింది. అదీ నేను కోరిన విధంగా!

అతనెవరో చాలా గొప్పవాడిలా ఉన్నాడు. మా ఆఫీసుకు ఏదో పనిమీద వచ్చినట్లున్నాడు. అటూ ఇటూ తిరుగుతూ చటుక్కున నన్ను చూసి ఆగిపోయాడు. ఏమనుకున్నాడో ఏమో నా దగ్గరకు వచ్చి "మేడమ్ ఏమీ అనుకోవంటే ఒక చిన్న ప్రశ్న. మీ పేరేమిటో చెప్పగలరా?" అన్నాడు.

అతనిలో ఏ ప్రత్యేకతా నాకు కనిపించలేదు. కానీ ఏ మనిషినైనా చూడగానే అప్రయత్నంగా అతని కళ్లవంక చూడడం నా అలవాటు అతని కళ్లు నాకు నచ్చలేదు. అతని ముఖం అందంగా లేకపోవడానికి అతని కళ్లే కారణ మనిపించింది. అయినా పేరు చెప్పడానికేముంది? "సుమతి!" అన్నాను నెమ్మదిగా.

"పేరు అందమైనదే కానీ ముఖం ఇంకా అందంగా ఉంది" అన్నాడతను.

నేను నవ్వి "చాలా థాంక్స్. మీ కేమైనా ఇక్కడ పని ఉందా" అన్నాను.

"ఉంది కానీ మిమ్మల్ని చూడగానే మరచిపోయాను. మీకు అభ్యంతరం లేదంటే..." అని అతను ఆగిపోయాడు. నేను కుతూహలంగా అతని వంక చూసి "లేదంటే...ఊఁ" అన్నాను.




"ఆఫీసుకు రోజూ ఇంత పెందరాళే వస్తున్నావు — నీ సంసారం జీవితం అంత సుఖంగా లేదా ?!"

అతను నిట్టూర్చాడు, "నా వయసు ఇరవై యారేళ్లు. లెక్కలేనంత ఆస్తికి వారసుణ్ణి. మంచి అందమైన భార్యకావాలని ఎంతో కాలంగా కలలు కంటున్నాను. ఇంతవరకూ నా కలలు ఫలించలేదు..." అతను మళ్లీ ఆగిపోయాడు. ఈ సారి నాకు కుతూహలం కలగలేదు. కొద్దిగా భయం కూడా వేసింది. డబ్బున్నవా డెవడూ ఇలా కట్టుకుని తను లెక్కలేనంత ఆస్తికి వారసుడనని చెప్పుకోడు. వీడెవడో నా బలహీనతను తెలుసుకుని వచ్చా డనిపించింది.

"మీ అభిప్రాయం నాకు అర్థమైంది. కానీ నేను మీరనుకున్నలాంటి మనిషిని కాను. నేను చూడగానే మనుషుల్ని అంచనా వేయగలను మీ ముఖం చూశాను. మీ కళ్లు నాకు నచ్చలేదు. కళ్లు బాగాలేని ఏ మనిషైనా —నాకు నచ్చడు." అతను ఎక్కువగా చొరవ తీసుకున్నాడనిపించడంవల్ల నేను కొంచెం మర్యాద నతిక్రమించి మాట్లాడానని చెప్పవచ్చు. అందుకే అతని ముఖం వివర్ణమైంది.

"చూడండి ఇంతవరకూ జీవితంలో ఓటమి అన్నది ఎరుగను నేను. ఏ నిర్ణయమైనా క్షణాలమీదనే తీసుకోవడం అలవాటు నాకు. మిమ్మల్ని చూసీ చూడగానే వివాహం చేసుకోవాలనిపించింది. అందుకోసం ఏమైనా చేయగలను. ఒప్పుకోకపోతే బలవంతంగా ఎత్తుకుపోయైనా వివాహం చేసుకోగలను. ఒప్పుకుంటే ఈ క్షణంలో మీ పేర బ్యాంకిలో లక్షరూపాయలకు అకౌంట్ ఓపెన్ చేయగలను" అన్నాడు.

కోతలకైనా అంతుండాలనుకున్నాను. వీడి సంగతేమో ఇప్పుడే తేల్చాలనిపించింది. అందుకు "అయితే నా పేర లక్షరూపాయలకు అకౌంట్ ఓపెన్ చేయండి. నేను మిమ్మల్ని వివాహం చేసుకుంటాను" అన్నాను.

"మీ బాస్ నడిగి పర్మిషన్ తీసుకోండి — ఇప్పుడే బ్యాంకుకి వెడదాం" అన్నాడు వాడు. వాడితో కలిసి బయటకు వెళ్ళడం ప్రమాదకరమనిపించింది. "మీరు బ్యాంకు దగ్గర ఉండండి ఒక గంటలో నేను వస్తాను. ప్రయివేటు బ్యాంకు కాదు, స్టేట్‌బ్యాంకు దగ్గరకు" అన్నాను. వాడు వెళ్ళిపోయాడు.

ఆశ, అనుమానం, ఆశ్చర్యం. భయం ఒక్కసారిగా కలిగాయి. జీవితంలో ఇది చెప్పుకోతగ్గ వింత సంఘటన అయితే మరో గంటన్నరలో నిజంగానే నేను లక్షాధికారిణి నయ్యాను.

వాడు-కాదు, సారీ—అతను-కాదు, సారీ —వారు ... అన్నమాట నిజంగానే నిలబెట్టుకున్నారు. వారిపేరు రామనాథం. మరో పది రోజుల్లో వారు నా శ్రీవారయ్యారు.

నేను రామనాథం శ్రీమతిని కావడం నా జీవితంలో ఒక బంగారు కల. నమ్మలేని నిజం.

నా కిప్పుడు స్వంత కారుంది. డ్రైవింగు కూడా వచ్చును. చాలా తరచుగా షాపింగుకు వెడుతూ ఉంటాను నేను. ఏ షాపుకు వెళ్ళినా అంతులేని గౌరవం లభిస్తూంటుంది నాకు. దరిద్రంపట్ల నా అసహ్యం మరింత పెరిగింది. అది చాలా తరచుగా వ్యక్తపరుస్తూంటాను నేను. కానీ వారి కళ్లపట్ల నాకుగల అసహ్యతను మాత్రం పైకి వ్యక్తపరచలేక పోతున్నాను.

నేను ప్రపంచంలో ఎక్కువగా ప్రేమించేవి రెండేరెండు. ఒకటి డబ్బు. అది నాకు లభించింది. రెండు—అందమైన కళ్లు. అవి వారికి లేవు. నేను డబ్బును ప్రేమించడంతో పాటు దరిద్రాన్ని అసహ్యించు కుంటాను. అందమైన కళ్లను ప్రేమించినట్లే — వికారమైన కళ్లను అసహ్యించు కుంటాను. కానీ వారి కళ్లనెలా అసహ్యించుకునేది ?

ఆ కళ్లు నన్ను చూడడం వల్లనే నాకీ వైభవం పట్టింది. అయినాసరే ఆ కళ్లంటే నాకు అసహ్యం. ఎంత సహించు కుందామన్నా

కుదరడంలేదు. ఇంత అదృష్టం నాకు కలిగించిన భగవంతుడే ఒక్క విషయంలోనూ ఎందుకు చిన్నచూపు చూశాడో అర్థం కావడంలేదు.

అన్నింటికంటె బాధాకరమైన విషయం మరొకటుంది. ఆయన ప్రేమగా నన్ను దగ్గరకు తీసుకుని "నీ అందమంతా కళ్ళలో ఉందిసుమా!" అని కళ్ళను ముద్దు పెట్టుకుంటారు. నేను తనకు అలా చేస్తానని ఆశిస్తారు. కాని నేనెన్నడూ ఆయన కళ్లను ముద్దు పెట్టుకోలేదు. ఆయన కళ్ళలో తీవ్రమైన ఆశాభంగం చూస్తాను. అయినా నేను చలించను. అసహ్యకరమైన ఆ కళ్ళను ముద్దు పెట్టుకోవడం నావల్ల కాదు. అంతేకాదు ఆయన ముందునగ్నంగా ఉన్నప్పుడు ఆకళ్ళు నన్నుకాంక్షతో చూస్తున్నాయన్నభావం నాకు కలిగించే జుగుప్సాభావం అంతా ఇంతాకాదు. నాలో ఉన్న అహంకారం పాలు ఎక్కువ కావడంవల్లనో ఆయన చాలా మంచివారు కావడంవల్లనో చెప్పలేను కాని చాలావరకు నాకు కలిగే భావాలను దాచడానికి కూడా ప్రయత్నించనునేను. ఆవిధంగా ఆయన్నుచాలాసార్లు నిరుత్సాహ పరిచాననే చెప్పాలి.

వారు దగ్గరలేనప్పుడు విన్నిసార్లు నాకు వారిమీద జాలికలుగుతూంటుంది. ఒకఅనామకురాలికి రాజయోగం పట్టించినవారికి తగిన సుఖం నేనివ్వలేకపోతున్నానని అప్పుడప్పుడు నాకు అనిపిస్తూండేది. కాని ఆకళ్ళను చూడగానే అన్నీ మరచిపోయేదాన్ని. గొంగళి పురుగు మీద పాకినట్లుండేది ఆకళ్ళు నన్ను కాంక్షతో చూస్తూంటే.

నేను కృతఘ్నురాలినేకావచ్చు. కానీ మామూలు బలహీనతకు లొంగిపోయిన సామాన్యురాలిని.

ఆయన ఎప్పుడూ నన్ను పల్లెత్తుమాట అనలేదు. నన్నుప్రేమగా చూడ్డం మానలేదు. తను దగ్గరలేనప్పుడు నా ప్రవర్తన మార్చుకోవాలని చాలా గట్టినిర్ణయాలు తీసుకునేదాన్ని. ఆయన సమక్షంలో ఆకళ్ళను చూస్తూ అవన్నీ మరిచిపోయేదానిని. అసహ్యమొక్కటే స్ఫురించేది. ఇలా ఎందుకు జరుగుతోందో మాత్రం నాకు తెలియదు. ఏదో అతీతశక్తి కీలొన్నై అలా ప్రవర్తిస్తున్నానేమో ననిపించేది.

ఏది ఏమైనా జీవితం సాఫీగానే నడిచిపోతోంది. ఎదుటి వ్యక్తికి బాధ కలిగిస్తున్నప్పటికీ నేను ఆనందంగానే జీవితం గడుపుతున్నాను.

ఇప్పుడు నాకొక కొత్త సమస్యబయల్దేరింది నాకడుపులో ఒక కొత్త ప్రాణికదులుతోంది. ఆప్రాణి ఆడకావచ్చు, మగకావచ్చు, కానీ ఆయన పోలిక తెచ్చుకుంటుందేమో నన్నది నాభయం. ఆయన పోలిక వచ్చినా నాకంత అభ్యంతరంలేదు, ఆకళ్ళు వస్తాయేమోనని అసలు భయం. చాలాసార్లు దేవుణ్ణి ప్రార్థించాను కూడా–పుట్టబోయే పాపకు నాపోలిక రావాలని. కానీ ఆయనకూడా దేవుణ్ణి ప్రార్థిస్తున్నారు తనపోలిక బాబుకురావాలని. ఒకరోజు నేను పక్కనుండగానే పైకి అనేశారు దేవుడి దగ్గర "నాకు బాబుపుట్టాలి. వాడికి నాపోలిక రావాలి "అని.

నాకు ఒళ్ళు మండి పోయింది "మంచి కోరికే దాకదాకవాడికి మీకళ్ళేరావాలా?" అన్నానుచిరాగ్గా. ఆయన ముఖం చాలాకోపంగా అయిపోయింది. "నీకు అందానికి అర్థం తెలియదు. తెలిసుంటే నాళ్ళకళ్ళలో అందంకనిపించేది" అనేసి అక్కణ్ణించి వెళ్ళిపోయారు.

నేను తెల్లబోయాను. ఆయన నన్నుఅంత మాట అంటారని నేను అనుకోలేదు. ఎందుకంటే అదే ప్రథమానుభవం మరి.

నెలలునిండాయి. వారికోరిక ప్రకారం నాకు బాబుకలిగాడు. వాడిపోలికలు మొదట్లో ఏమి తెలియలేదు. కానీ ఆరేడు నెలలవయసు వచ్చే సరికి వాడిలో క్రమంగా ఆయన పోలికలు కనిపించసాగాయి. దేవుడు ఆయన కోరికను మన్నించాడు. వాడిజుట్టు ఆయనజుట్టుకు మల్లేనే ఉంగరాలు తిరిగి ఉంటుంది. చూడగానే ముక్కూ, చెవులూ ఆయనవేనని చెప్పవచ్చు. అయితే దేవుడు నాకోరికను కూడా మన్నించాడు. వాడికళ్ళు మాత్రం ఆయనవి కాదు. ఎంతో అందమైన కళ్ళు. నాఅదృష్టాన్ని నేనే అభినందించు కున్నాను. నాబాబును నేను అసహ్యించుకోవలసిన ఆగత్యం తప్పింది.

బాబు అంటే ఆయనకు ఎంతో అభిమానం. బాబు పుట్టాక మా ఇద్దరి అనుబంధం మరింత పెరిగింది. ఆయన నన్నింకా ఎక్కువగా అభిమానిస్తున్నారు. ముఖ్యంగా వాడి కళ్ళంటే ఆయనకు ప్రాణం. రోజుకో వందసార్లయినా వాటిని ముద్దులాడతారు. ఆ దృశ్యం నాకు చాలా ఆనందాన్ని కలిగిస్తుంది.

## స్కోరెంత ?-8

### గెలుపా - ఓటమా

రామనాథన్ క్రిష్ణన్ పేరు టెన్నిస్ ఆడేవాళ్ళకి అది చూసి- దాని గురించి చదివి ఆనందించేవారికి కూడా పాతిక సంవత్సరాలుగా పరిచయమైన పేరు.. ఈమధ్యనే హైదరాబాద్‌లో జరిగిన నేషనల్ హార్డ్ కోర్ట్ టెన్నిస్ ఛాంపియన్ షిప్ పోటీల్లో రామనాథన్ క్రిష్ణన్ 17 సం.ల బాలుడి చేతిలో ఓడిపోయాడు!

పాతిక సం.ల క్రితం రామనాథన్ క్రిష్ణన్ కలకత్తాలో తన 17వ ఏట నేషనల్ హార్డ్ కోర్ట్ టెన్నిస్ ఛాంపియన్ అయినాడు. దేశమంతా అటు తిరిగి చూసింది... "టెన్నిస్ స్టార్ ఉదయించిందన్నారు– అప్పుడు ఆ

ఆయన మంచి తనాన్నర్థం చేసుకున్నాను నేను. మానసికంగా ఆయనకు బాగా దగ్గరవుతున్నాను. కానీ ఆయన కళ్ళ పట్ల నా కున్న అసహ్యభావం మాత్రం లేశమయినా తగ్గడం లేదు.

బాబు పెద్దవాడవుతున్నాడు. చాలా అల్లరి చేస్తున్నాడు. వాడేంచేసినా నాకు ఎంతో ముద్దుగా ఉంటోంది. జీవితంలో తల్లి కావడానికి మించిన మధురానుభూతి లేదన్న నగ్నసత్యం అవగాహన అవుతోంది.

ఒకరోజు ... ...

బాబు ఒక పుస్తకం పట్టుకుని నా దగ్గరకు వచ్చాడు. "అమ్మా, చూడు ..." అంటూ అది ఆయన డైరీ వాళ్ళ ఎక్కడైనా ఏమైనా చింపేశాడేమోనని కాస్త జాగ్రత్తగా పరిశీలించి చూశాను. చింపిన జాడ కనపడ లేదు. కాని డైరీకున్న ప్లైడు కవరులో ఏదో ఫొటో ఉన్నట్లు అనిపించి లాగి చూశాను. ఆ ఫొటో ...

ఉలిక్కిపడ్డాను. ఆ ఫొటోలో వ్యక్తి నాకు బాగా తెలుసు. గుర్తుపట్టడానికి క్షణం కూడా పట్టలేదు. నేను తొలిసారిగా అసహ్యించుకున్న అందమైన కళ్ళున్న ఆ వ్యక్తి శేషగిరి.

శేషగిరి ఈయనకు తెలుసా ? ఫొటో

టెన్నిస్ స్టార్ రామనాథన్ క్రిష్ణన్ యెంత సంతోషించాడో యిప్పుడు వోడిపోయి కూడా అంతే సంతోషించి వుంటాడు- తనను వోడించిన రమేష్ [15 సం.ల అరుమాసాల వయసు] ని కౌగలించుకుని బహు అరుదుగా మనిషికి జీవితంలో లభించే అతి మధురమైన అపురూపమైన అనుభూతిని పొంది వుంటాడు...కారణం ?

ఛాంపియన్ అయిన బాలుడు "రమేష్" మరెవ్వరోకాదు రామనాధన్ కృష్ణన్ కొడుకు రమేష్ కృష్ణన్... 'పుత్రాదిచ్ఛేత్ పరాజయమ్' అన్నారు. భారత టెన్నిస్ ప్రపంచానికి మకుటం లేని మహారాజు రామనాధన్ కృష్ణన్ మీద స్కోర్ చేసిన యువ టెన్నిస్ రాజుని చూసి టెన్నిస్ ప్రియులు 'టెన్నిస్ తార' మరొకటి ఉదయించిందని వర్ణించారు. [★★★]

దగ్గరుంచుకునేటంత స్నేహముందా అతనితో ? అయితే ఎన్నడూ ఆయన నా దగ్గర శేషగిరి ప్రసక్తి తీసుకురాలేదంటే అందుకు కారణం ఏమిటి ?

నాకు డైరీ రాయడమన్నా, అది రాసేవాళ్ళన్నా చిరాకు. ఆయన డైరీ రాస్తారని తెలుసుండీ ఎన్నడూ దానివంక చూడాలని కూడా అనుకోలేదు. కానీ ఈరోజు ఆయన డైరీ చదివాను. అయితే అందులో చెప్పకోదగ్గ విశేషాలేమీలేవు. చాలా సామాన్యమైన వివరాలున్నాయి.

పరుగెత్తుకు ఆయన దగ్గరకు వెళ్ళాను. ఆయన ఏదో రాసుకుంటున్న వారల్లా ఉలిక్కిపడి "ఏమిటోయ్ విశేషం"అన్నారు. ఫొటో ఆయనకు చూపించాను. "బాబు మీ డైరీలో ఆడుతూంటే ఈ ఫొటో అందులోంచి పడింది. ఎవరండీ ఈయన ?" అనడిగాను,

ఆయన ముఖంలో అదోరకమైన నవ్వు కనిపించింది. "అతనెవరో నిజంగా నీకు తెలియదా ?" అన్నారు.

ఒక్కక్షణం తటపటాయించాను. అబద్ధమాడడం మంచిది కాదనిపించింది. "తెలుసు. కానీ ఈయన మీ కేమవుతాడో తెలుసుకోవాలనుంది" అన్నాను.

"అతను నాకేమవుతాడో చెప్పలేను. అతను నాకేమికాడో కూడా చెప్పలేను. చిన్నతనం నుంచీ నా కెందరో స్నేహితులున్నారు కాని ఆరునెల్ల పరిచయంతో నా కత్యంత ఆప్తుడైపోయాడు శేషగిరి. హాస్పిటల్లో — అత్యంత దీనావస్థలో నే నున్న సమయంలో ఇతని పరిచయం లభించింది. తనకు క్యాన్సరు వచ్చిందనీ ఎంతోకాలం బ్రతకననీ అన్నాడు. మా ఇద్దరికీ గొప్పగా జత కుదిరింది." అంటూ ఆగారాయన.

"ఇప్పుడాయన ఎక్కడున్నాడు ?"

"స్వర్గంలో బహుశా ఇంద్రుడు అర్ధాసన మిచ్చి ఉండవచ్చు..." అంటూ నిట్టూర్పు విడిచారాయన.

"ఒక్క సందేహం—అతను నాకు తెలుసని మీకెలా తెలుసు ?"

"అతను నాకన్నీ చెప్పాడు. నిన్ను తను అమితంగా ప్రేమించాడట. కానీ నువ్వతన్ని ప్రేమించలేదుట నువ్వు ఆమాయకురాలివట. డబ్బుగురించి కలలు కంటున్నావని చెప్పాడు. నీ గురించి అతను చెప్పిన వివరాలూ, నిన్ను నేను వివాహం చేసుకోవాలన్న అతని కోరికే మన ఈ ప్రస్తుత జీవిత విధానానికి దారితీశాయి" అన్నారాయన.

ఏమిటీ? శేషగిరి కోరిక మీద ఈయన నన్ను వివాహమాడేరా? ఇది నిజమా? నా కోరిక తెలిసిన శేషగిరి నా కోసం ఇంతమంచి వరుణ్ణి వెతికాడా? "మీరేదో దాస్తున్నారు. ఆరునెల్ల పరిచయంతో ఆయన మీకు వధువును చూసేటంత ఆప్తుడెలా గయ్యాడు? బాబుమీద ఒట్టేసి చెప్పండి" అన్నాను.

ఆయన ఉలిక్కిపడ్డట్టే కనిపించారు— "ఛీ! ఒట్టేమిటి? ఇంత చిన్న విషయానికి?"

"ఇది చిన్న విషయం కాదు నాకు నిజం చెప్పకపోతే బాబుమీద ఒట్టే!" అన్నాను దృఢంగా.

ఆయన ముఖంలో క్రమంగా రంగులు మారాయి. ఒక్కక్షణం ఆగి "నీకు నిజం చెప్పనని శేషగిరికి మాట ఇచ్చాను. కానీ ఆ మాట నిలబెట్టుకోవడం నా వల్లకాదు. నిలబెట్టుకోడంవల్ల ప్రయోజనమూ కనబడ్డంలేదు. ఈ నిజం నువ్వు తెలుసుకోవలసిన అవసరం కూడా ఉందనిపిస్తోంది నాకు" అని ఆగి "ఫోటో చూశావు. మనిషి కూడా తెలుసు. నిస్సంకోచంగా చెప్పు శేషగిరి కళ్లు ఎలా వుంటాయి?" అన్నారాయన.

"చాలా అందంగా" అన్నాను.

"మరి నావి?"

"ఎందుకండీ తెలుసుండీ అడుగుతారు?" అన్నాను అసహ్యంగా ఉంటాయని అనలేక.

"మరి రెండూ ఒకటే నంటే నమ్మగలవా?"

"ఏమిటీ?" అన్నాను. విషయం సరిగ్గా అర్థం కాకపోయినా ఎందుకో షాక్ తిన్నట్లనిపించింది.

"ఒక చిన్న యాక్సిడెంట్లో నా కళ్ళు దెబ్బతిన్నాయి. హాస్పిటల్లో ట్రీట్‌మెంట్ తీసుకుంటున్నాను. డబ్బున్నవాణ్ణి కాబట్టి శస్త్ర చికిత్సలో నిపుణులు ఎంతో శ్రద్ధ తీసుకుని వైద్యం చేస్తున్నారు నాకు. అయితే కొత్త కళ్ళు కావాలి నాకు. లేకపోతే శాశ్వతంగా గుడ్డివాణ్ణి కావాలి. ఆ సమయంలో నన్ను వెదుక్కుంటూ వచ్చాడు శేషగిరి. తను క్యాన్సరుతో బాధ పడుతున్నాననీ, రోజులు లెక్కపెట్టుకుంటూ బతుకుతున్నాననీ, మరణానంతరం తన కళ్ళు నా కిస్తాననీ అన్నాడు. అయితే ఒక షరతు పెట్టాడు. నీ వివరాలన్నీ చెప్పి నేను నిన్ను వివాహం చేసుకోవాలన్నాడు. నేను అంగీకరించిన మర్నాడే అతను ఆత్మహత్య చేసుకున్నాడు. తన కళ్లను నా కుపయోగించవలసిందిగా చీటీ రాసిపెట్టి మరీ చనిపోయాడు. ఫలితంగా అతని కళ్లతో నేను చూడగలిగాను. నిన్ను పొంద గలిగాను."

నా కళ్లలో నీళ్లు తిరిగాయి. "మీ కోసం నా కోసం అతను కొంచెం ముందుగా ప్రాణాలు తీసుకున్నాడన్న మాట" అన్నాను

"కొంచెం ముందుగా కాదు, చాలా చాలా ముందుగా— అతనికి ఏ క్యాన్సరూ లేదని పోస్టుమార్టంలో పోలీసు డాక్టరు ధృవపర్చాడుట—"

"చాలా పెద్ద దెబ్బ తిన్నాను. హఠాత్తుగా నాకుజ్ఞానోదయం కూడా అయింది. శేషగిరి నన్ను చూశాక నాకోసమే బ్రతకాలనుకున్నాడు. నన్ను మితంగా ప్రేమించాడు. కానీ నే నతన్ని తిరస్కరించాను. కాబట్టి బ్రతుకు నంతం చేసుకోదలిచాడు. అయితే నాకు డబ్బంటే ఇష్టమని అతనికి తెలుసు. అతని కళ్లని నేను ప్రేమించాననీ తెలుసు. ఆ రెండూ నాకు లభించేలా చేశాడు. చనిపోయినా కలకాలం అతని కళ్ళు నన్ను చూసే ఏర్పాటు చేశాడు. అతని ప్రేమ అపూర్వం.

అంతేకాదు ప్రేమ పరంగా నేను దరిద్రు

## చేపల లెక్క

సుమారు డెబ్బైఐదు సంవత్సరాల క్రితం ప్రపంచం మొత్తంమీద పల్లెకారులు నాలుగు మిలియన్‌ల టన్నుల చేపలు పట్టేవాళ్ళు...1960 నాటికి చేపలు పట్టేవారి సంఖ్య చేపలలా కూడా పెరిగిపోయాయి. నాలుగు మిలియన్‌ల టన్నుల నుంచి ఒక్క 60 సంవత్సరాల కాలంలో మనుషుల ఆహారం కోసం సముద్రాలలో పట్టుబడే చేపల సంఖ్య 40 మిలియన్‌లు అయింది ఇప్పుడు ప్రపంచంలో డెబ్బై మిలియన్‌లు అంటే ఏడుకోట్ల టన్నుల దాకా చేపల్ని పట్టు కుంటున్నారు.

అమెరికా, జపాన్, రష్యా, ఫ్రాన్స్ మొదలైన దేశాలన్నీ కలసి, సముద్రాలను గాలించి, చేపలెన్నేసి వున్నాయో తెల్సుకుంటున్నారు. మనిషి ఆహారం కోసం సముద్ర గర్భంలో జరిగే అన్వేషణ సముద్ర జలాలలో పల్లెకారులు జరిపే వేటకూడా ఎక్కువైనాయి!

రాలిని. వికారనయనని. నాదగ్గర ప్రేమధనం లేదు. అందమైన ప్రేమదృష్టి లేదు.

అయస్కాంతానికి ఉత్తర దక్షిణధ్రువాలుంటాయి ఉత్తరధ్రువం-ఉత్తరధ్రువందగ్గరగా వస్తే వ్యతిరేక శక్తులు పనిచేసి రెండూ దూరంగా విడిపోతాయి. అయితే రెండు వ్యతిరేక ధృవాలు (ఉత్తర, దక్షణ ధృవాలు) దగ్గరగా వస్తే ఆకర్షించు కుంటాయి. ఇది

## అస్పృశ్యనయనాలు

అయస్కాంత లక్షణం.

నేను దరి దాన్నీ, అందవికారాన్నీ అసహ్యించు కోడానికి కారణం నాకున్న అయస్కాంత లక్షణమే!

శేషగిరి ముఖానికి అందంగా కనిపించే ఆ కళ్ళు ఆయన ముఖంలో అసహ్యంగా కనబడుతున్నాయి కళ్ళలో ఏమీలేదు వాటికి ప్రాముఖ్యత లేదు. ఈ సత్యం గుర్తించిన నేను తటాలున ఆయన్ని కౌగలించుకుని ఆకళ్ళనుముద్దు పెట్టుకున్నాను. సృష్టిలో ఇంతవరకూ ఏ ప్రియురాలికి లభించనిఅమూల్య కానుకఆకళ్ళు! ఇప్పుడాకళ్ళు నాకు చాలా అందంగా కనబడుతున్నాయి.

అయితే ఆయన ముఖంలో మార్పు కనబడింది నాకు. బాగా పరిశీలించి చూడగా అది అసూయ అని అర్థమైంది. ఇంతకాలం అసహ్యించుకున్న ఆ కళ్ళను - శేషగిరివి అని తెలియగానే ముద్దు పెట్టుకున్నానంటే ఆయన సహించగలరా ?

ఇప్పుడు ఆయన కళ్ళంటె నాకెంతో ఇష్టం. నా ప్రతి చేష్టలోనూ ఆ భావం వ్యక్తమవుతూనే ఉంటుంది. నా మదిలోని భావాలను దాచుకోవడం కష్టం కానీ ఆ కళ్ళనుపొగడలేను. ముద్దాడలేను.

బహూశా శేషగిరిలాంటి ఆ సామాన్యుడి నయనాలను తాకే అర్హత నాకు లేదని తలచి భగవంతుడు కలకాలం వాటిని నాకు అస్పృశ్య నయనాలుగా చేశాడు.




(గత సంచిక తరువాయి)

4

పెట్రొమాక్స్ దీపం ఇంకా ఊగుతూనే ఉన్నది. దాని కనుగుణంగా దాని చుట్టూ ఉన్న రెక్క పురుగుల మూక గూడ కదులు తున్నది. కాగి ఉన్న దీపపు అద్దాన్ని ఢీకొని భూ పతన మవుతున్న రెక్క పురుగులను నేలమీద నున్న రెండు లొండలు మింగు తున్నాయి.

ఎటో కార్యార్థమై వెళ్ళి ఉండిన తోటి వాడు చెప్పుల జతను చేతబట్టుకుని పెదరెడ్డి పెద్ద అంగలేసుకుంటూ వచ్చాడు. వాడు పందిరికి అవతల నిలుచుని, పెట్రొమాక్స్ దీపపు కిరణాల కడ్డంగా అరచేయి పెట్టుకుని కొంతసేపు పరిశీలించి చూసి, "ఎవురాడ. రామచంద్రుడా? ఏంవిరా ఇట్టొచ్చినావు?" అనడిగాడు.

రామచంద్రుడు తల ఎత్తి ఏదో చెప్ప బోయేటంతలో సత్తిగాడు కల్పించుకుని రామ చంద్రుని వైపొకసారి అసహ్యంగా చూసి, తరవాత తోటివాని వైపు చూసి, "పెదరెడ్డి దొంగ సాచ్చులు చెప్పించి కోరుటులో గెలిచి నాడంట. మనవంతా దొంగసాచ్చులెప్పి నామంట. ఆ మాట చెప్పేదాని కొచ్చినా డీడు" అన్నాడు.

వాడిలా చెప్పి ముగించగానే రామచంద్రుడు తోటివాడితో "నేనట్టా మాట అనలేదు తోటి మామా. ఊరి 'నాయాలు' నాకెందుకు ఇల్లు ఖాళీ జెయ్యమని గవుర్మెంటోల్లు తాకీదు ఇచ్చినారు. నా కర్మం పెదరెడ్డితో చెప్పుకుందారనొచ్చినా నంతే" అన్నాడు.

తోటివాడు, "ఇంగ చెప్పుకునే దేందిరా. జరిగిపోయిన పెండ్లికి మేళం వూదినట్టు ఇంగ జెప్పుకునే దేంది? కలెక్రటు ఆర్డరు అయింది గదా. రేపు పొద్దు నాలుగు బార లెక్కసరికి నీ ఇంటిని కుప్పదోసి పెట్తాం. ఈలోగా చేరికి చిక్కింది తీసుకుని బయ ల్దేరు' అన్నాడు.

రామచంద్రుడు రెడ్డిగారి మూడంత స్థుల భవంతిని తలఎత్తి చూసి, తన కంఠంలో ఇంచుక కరుకుతనం, ఆత్మ స్థైర్యం తొణికిస్తూ, "రిజిస్ట్రారాపీసులో ఆ నేల నా పేరున పట్టా అయింది గదా. సంతకాలు, ఏలిముద్రలు అయినాయి గదా. ఇప్పుడా నేల నాది కాదని ఎవరు మాత్రం ఏట్టంటారు?" అన్నాడు

విచిత్రంగా ధ్వనించిన అతని కంఠాన్ని విని అట నున్న హరిజనులందరూ తమచేతుల లోని పనులు మానివేసి నిశ్శబ్దమైపోయారు.

తోటివాడు నింపాదిగా, "చుక్క పెట్టి నట్టు ఆ నేల నీ పేరు మీదనే పట్టా అయిందంటావా?" అనడిగాడు.

రామచంద్రుడు తెల్లబోతూ, "అదేంది తోటి మామా. ఆ పూట నువ్వు గూడ రిజిస్ట్రారాపీసులో ఉంటివి గదా" అన్నాడు.

తోటివాడు నిశ్శబ్దంగా ఉన్న పరిసరాలను ఒకసారి కలియ జూసి, మళ్ళీ రామచంద్రుని వైపు తిరిగి, "ఐతే నువ్విపుడు పెదరెడ్డిని కోరుట్టుకు ఈడ్చి బుద్ధి చెప్తానంటావు. నన్ను సాచ్చికి ఏసుకుంటా నంటావు" అన్నాడు.

రామచంద్రుడు అస్పష్టంగా "నేను అంతటోడినా. దేవుడే బుద్ధిచెప్తాడు" అన్నాడు.

"దేవుని దాకా ఏందుకు? నువ్వే చెప్ప చెప్పకూడదా" అంటూ తోటివాడు ఎడమ చేతినుండి ఒక చెప్పును కుడిచేతిలోకి తీసు కుని బలంగా విసిరాడు. అది గురి తప్పి అట నున్న ఇటుకరాతి గోడకు తగిలింది. వెంటనే వాడు రెండవ చెప్పును గురిచూసి వదిలాడు.

**జరిగినకథ : 2** రామచంద్రుడు చేసిన చాకిరీకి ఫలితంగా ఇల్లు కట్టుకోవ టానికి పోరంబోకు నేల ఇప్పిస్తాడు పెదరెడ్డి. రామచంద్రుడి భార్య నాగ. పెదరెడ్డి కోరినట్లు కోర్టుకెళ్ళి దొంగ సాక్ష్యం చెప్పడు రామచంద్రుడు పెద రెడ్డి రిపోర్టు చేయటంతో పోరంబోకు ఖాళీచేయమని రామచంద్రుడికి ఉత్తర్వు జారీ చేస్తాడు కలెక్టరు. 'పెద్దరెడ్డిని' వేడుకోటానికి వస్తాడు రామచంద్రుడు.

అది రామచంద్రుని ముఖాన్ని ఫెడీల్మని తాకి ఇసుకనేల మీద పడింది. రామచంద్రుడు బాధతో కేకవేసి రెండు చేతులతో ముఖం కప్పుకున్నాడు. సత్తిగాడు మెరపువలె లేచి రామచంద్రుని కడుపుమీద బలంగా తన్నాడు. రామచంద్రుడు తూలుతూ వెళ్ళి ఇసుకమీద వెల్లకిల పడ్డాడు కడుపులో ప్రేగులు తెగి పోతున్నట్టుగా అతనికి అనిపించింది.

వెల్లకిల పడిన అతడు ప్రక్కకు తిరిగి మోకాళ్లను ఇసుకమీద ఊనుకుని పైకి లేచాడు.

సత్తిగాడు, "నీ...కొడకా...మా కులం చెర్చేదానికి పుట్టినావురా. నీ...–. ఎంత తిమురెక్కిందిరా నీకు. పెదరెడ్డిని కోరుటు కీడ్చే సత్తా లేకపోయిందని వగస్తా ఉండావు గదరా" అంటూ మీదకు రాసాగాడు.

రామచంద్రుడు నాలుగు బారలు వెనకకు జరిగి నిటారుగ నిలుచుని, "ఒరే సత్తిగా నే న్నీజోలికి రాలేదు. నీ పేరెత్తలేదు. అనవసరంగా నామీద చెయ్యేసినావంటే బాగలేదు" అన్నాడు.

సత్తిగాడు ముందుకొస్తూ, "చెయ్యి ఏయ్యడం కాదురా. నిన్నీపూట కీలు కీలుకు ఇరగ్గొట్టకుండా ఇడిపి పెట్టేది లేదురా" అన్నాడు.

అలా మీదకొస్తున్న సత్తిగాడిని చూస్తుం డగా యుద్ధం తప్పదని రామచంద్రునికి అని పించింది. ఉద్రేకం విషంవలె అతని దేహ మంతా ప్రాకింది. గోచిని బిగించి ఎగగట్టాడు. రోమమయమైన తొడలు పెట్రొమాక్స్ దీపంలో నిగనిగ లాడుతూ కనిపిస్తున్నాయి. అతడు తొడలను చరచి, "రా. రా. మాది గోనికి పుట్టినోడా. నీ ఎవికలేరి కుప్పపెట్ట స్తాను. రా" అంటూ మోకాళ్లనూ, వడు మును ఇంచుక వంచి, పిడికిలి బిగించిన బల మైన చేతులను ముందుంచుకుని, ఏ క్షణాన నైనా తనమీద పడనున్న సత్తిగాడినిచూస్తూ నిలుచున్నాడు. అతని ముందు రెండు బారల దూరాన సత్తిగాడు నిలుచుని చావుదెబ్బ కొట్టడానికి అనువైన అవకాశం కోసం తన దేహంలో ప్రతి కండరాన్నీ ఆయత్తం చేసు కుని నిలుచున్నాడు.

మిగిలిన హరిజనులు తమ మోకాళ్లను, అరచేతులనూ ఇసుక నేలమీద ఊనుకుని నాలుకలను పండ్ల మధ్య పెట్టుకుని కను గ్రుడ్లు పెద్దవి చేసుకుని చూడసాగారు.

పెట్రొమాక్స్ దీపం నిశ్చలంగా వెలు

గుతూ ఉంది. కొంతసేపటి క్రితం రామచంద్రుని భుజం తగిలినప్పటి నుండి అది సజావుగ వెలగడం లేదు. అంధకారంలో ఉన్న దాని వత్తి తన తెల్లదనాన్ని కోల్పోయి రక్తపు పొరచేత కప్పబడి ఉన్నట్లు ఎర్రగ వెలుగుతున్నది. దాని కాంతి, రాహుగ్రస్తమైయున్న సూర్యుని కాంతివలె మందంగా అస్పష్టంగా ఉన్నది.

సత్తిగాడు తన కుడిచేతి ముంజేతికి ఉన్న ఇత్తడి కడియాన్ని ఎడమ చేతితో కిందకు జరిపి మణికట్టు మీద వదిలి పెట్టాడు. [illegible] కుడిచేతి పిడికిలిని బిగించగా కడియం మణికట్టు చుట్టూ బిగుతుగా అమరి ఉన్నది. కడియపు అంచు కత్తి వాదర వలె పదునుగా ఉన్నది. వాడు చేయి విసిరి మణికట్టులో చేవ దూలాన్ని ఢీ కొంటే దూలం అంగుళం లోతు దిగుతుంది, రామచంద్రుని కపాలం ఒక లెక్కా.

సత్తిగాని పోకడలను లోటివాడు త్రుటి కాలంలో ఆకళింపు చేసుకున్నాడు. వాడు రెండడుగులు ముందుకేసి, "ఒరే సత్తిగా నెత్తురొచ్చే వన్నెయ్యొద్దురా. నెత్తురు రాకుండా వాడిని నలగ గుద్ది పారేయ్' అని మిగిలిన హరిజనుల వైపు తిరిగి "తఁవాస చూస్తా వుండారు గదరా కోతులకు పుట్టి నెదవల్లార. అందరూ లేసి తలా ఒక ప్రక్కన కమ్ముకుని వాడిని ముగించెయ్యండ్రా" అనరిచాడు.

వాళ్ళు మరుక్షణమే లేచి తమ మోకాళ్లకు అరచేతులకు అంటుకుని ఉన్న ఇసుకను గూడా దులుపుకోకుండా ఎక్కుపెట్టి విడిచిన అమ్ములవలె దూసుకుపోయి రామచంద్రుని చుట్టూ కమ్ముకున్నారు.

పెట్రోమాక్స్ దీపానికి ఉన్న గాజు పలకలు రక్తసిక్తమైయున్న దంతాలవలె వెలుగుతున్నది.

హరిజనుల మూక మధ్య రామచంద్రుడు కనుపించలేదు. వాళ్ళు తమ మోకాళ్ళతో మోచేతులతో, పిడికిళ్ళతో, గుడికాళ్లతో పొడుస్తూ రామచంద్రుడిని విగత జీవుడిని చేయడానికి ప్రయత్నిస్తున్నారు. ఆ అవకాశం లభించని కొందరు మూకకు వెలపల ఉండి ఇసుకమీద చిందు లేస్తున్నారు. ఒకడు "వీడంతా ఎంత? వీనిబతుకంతా ఎంత? వీడు పెదరెడ్డినే విదిరి సొద్దా! ఆయన తిని లేచినపుడు రాలే ఎంగిలిమెతుకులకుదిటవ్వుగా వీనిబతుకంతా?" అంటున్నాడు. మరొకడు ఉద్రేకం పట్టలేక "వీని పెండ్లాన్ని దొమ్మరోళ్లు... రేపీయాలకు వీని పెండ్లాం తెల్లకోక కట్టుకుని మూల కూర్చోవాల. ఈ పూట వీని సావు కండ్ల జూడందే ఇంటికి పోయేది లేదు."

ఉన్నాడు. అతని వీపుమీద సత్తిగాడు కూర్చుని ఉన్నాడు. వాడు తన ఎర్రటి తువ్వాలును రామచంద్రుని మెడ చుట్టూ వేసి మెలిపెడుతున్నాడు. కణతల మీదుగనూ, చెమటలు కారుతుండగా, రెక్కలమీద కండరాలు పొంగుతుండగా, నాలుకను బయట పెట్టుకుని సత్తిగాడు తువ్వాలును మెలిపెడుతున్నాడు.



అనరుస్తూ, రామచంద్రుని పరివేష్టించి ఉన్న జనం కాళ్ల సందున దూరడానికి ప్రయత్నించ సాగాడు.

ఇంతలో గుంపు మధ్య నుండి సత్తిగాడు గాండ్రించాడు. "జరగండ్రా అడపాసు నాయాండ్లారా జరగండా. ముందుగా నాకు ఊపిరి తిరగకుండా చేస్తా వుండారు గదరా" అని. గుంపు విచ్చిపోయింది. రామచంద్రుడు విరిగిన చెరకు గడవలె ఇసుక నేలమీద పడి

రామచంద్రుని కనులకు అనంతమైన చీకటి, అందులో దేదీప్యంగా వెలుగుతున్న కోణాలు కనిపిస్తున్నాయి. అతని చెవులకు భయంకరమైన నిశ్శబ్దమూ, దానిని చెదరగొడుతూ భయంకరమైన ఘోషలు వినిపిస్తున్నాయి.

ఇంతలో ఒక లాంతరు రెడ్డిగారి భవంతిలోనుండి గేటుదాటుకుని వీధిలో కొచ్చింది. లాంతరును పట్టుకుని ఉన్న కరణం అక్కడ

జరుగుతున్న బొమ్మనీ చూసి ఆగిపోయాడు. కరణం వెనక నిలుచుని ఉన్న రెడ్డిగారు గంభీరమైన కంఠంతో "ఏందిరా ఆడ గాడిదగొడుకుల్లారా" అన్నాడు. ఆ కంఠాన్ని విని హరిజనులందరు బెదిరిపోయిన గొర్రెల వలె నిశ్శబ్దంగా అటు ఇటు చూడసాగారు.

తోటివాడు ఇసుక నేలమీద పరుపరున అడుగులేసుకుంటూ రెడ్డిగారి చెంతకు నడిచి నడుమును ఇంచుక వంచి చేతులను రొమ్ముల మీద కట్టుకుని. "రామచంద్రుడు సామి. వాని తలకాయ దరణి మీద నిలాటం లేదు. మా పాటుకు మేం పన్జేసుకుంటా వుంటే వొచ్చి గిచ్చి జగడాలకు తీస్తా ఉంటాడు. మేం వంతా కోరుటులో దొంగసాచ్చి జెప్పినాం వంట—" అన్నాడు.

వాని మాటను మధ్యలోనే తుంచుతూ రెడ్డి, "ఊం!!" అన్నాడు. తరువాత తలఎత్తి "సత్తిగా ఇట్రా రా" అని పిలిచాడు.

సత్తిగాడు పండ్ల మధ్య బయట పెట్టుకుని ఉన్న నాలుకను లోపలకు లాగుకొని, మెలి పెడుతూ ఉండిన తువ్వాలును వదిలి పెట్టి, లేచి, రెడ్డిగారి చెంతకొచ్చి వినయంగా నిలుచున్నాడు.

రెడ్డి. "ఏందిరా. నువ్వు చేస్తావుండే పని?" అనడిగాడు.

సత్తిగాడు గసపోసుకుంటూ. "ఆ నా కొడుకు. నోరు పట్టని మాటలన్నీ మాట్లాడి నాడు సామీ. వాన్ని ఈ చేతులతో చంపి, ఈ చేతుల్తోనే గోరీ కట్టేస్తా సామీ" అన్నాడు.

"ఆగు" అన్నట్లు రెడ్డిగారు చేయి ఎత్తి సైగచేసి, "సత్తిగా కొండమాదిరి తలకాయ పెంచుకోనుండావుగాని దాంట్లో మెదడు కొంచెం గూడా లేదురా. ఏ పని ఎప్పుడు చెయ్యాలో తెలవదు" అని ఏదో చెప్పబోయే ఆగి, సంకోచిస్తూ నలుపైపులా చూసి, "సరె. నువ్వు పో. పందిరిపని చూడు. రామ చంద్రుని జోలికి నువ్వేమీ పోబోకు" అని. తోటివానివైపు చూసి "రామచంద్రుడు కదలకుండా మెదలకుండా ఉండాడేందిరా. సచ్చినాడేమో చూడు" అని పురమాయించాడు.

తోటివాడు ఇసుక నేలమీద చలన రహితంగా పడిఉన్న రామచంద్రుడిని సమీపించి ముక్కువద్దనూ, రొమ్ముమీదనూ అరచేతిని ఉంచి చూసి, తిరిగొచ్చి, "ఊపిరి ఆడతా ఉంది సామీ. తెలివి దప్పి పడుండా డంతే. ఈ అగ్గరారాన్నీ, మాలపల్లినీ ముంచేసిదే వాడు సావడు సామి" అన్నాడు.

రెడ్డిగారు ఒకసారి హరిజనులనందరినీ కలయజూసి. "సరె. మీరేవరూ వాడిజోలికి పోకండి. ఇంకొంత సేపు తెలివి రాకపోతే నలుగురు పట్టి తీసుకుపోయి చింతతోపుల కనతల పారేసిరండి." అని కరణంవైపుతిరిగి, "పద" అన్నాడు.

కరణం, రెడ్డిగారు, పూజారీ ఊరిబయట నున్న దేవాలయం వైపు సాగిపోయారు. వారి వెనక ఇద్దరు హరిజనులు చేరోకత్తిని చేత బట్టుకుని అంగరక్షకులుగా నడుస్తున్నారు.

హరిజనులు తమపనులను ప్రారంభించారు. కొందరు రామచంద్రుని చుట్టూ చేరారు. రామచంద్రుడు నిశ్చలనంగా పడిఉన్నాడు. గూనివాడొకడు అతని ప్రక్కన కూర్చుని ఇంచుక సేపుచూసి, "చ్చొచ్చొచ్చొ సత్తిగా. కోడి మెడనులిమినట్లు నులిమేసి నావుగదరా. ఇప్పటిప్పట్లో తెలివివొచ్చేట్లుగా. లేదు," అన్నాడు.

సత్తిగాడు, "ఒక ముంతనీళ్ళు తీసుకొచ్చి వానిముఖానచల్లు. వాడేలేచి కూర్చుంటాడు." అన్నాడు.

ఒక ముసలివాడు పొగాకు కాడను నములుతూ, "ఇంతరాత్రిల్లో మంచినీళ్ళకోసం యాడబోదుం" అంటూ, అట పడిఉన్న కొబ్బరిచిప్పను తీసి. గూనివాని వైపు విసిరి వేసి, "గూనోడా. ఆకొబ్బరిచిప్పనిండా నీవుచ్చ పట్టి వాని ముఖాన చల్లు. తెలివొస్తుంది." అన్నాడు.

అందరూ ఘొల్లుమని నవ్వారు. ఇసుకు మీద పరుగెడుతున్న కొబ్బరి చిప్పను ఒక హరిజనుడు మధ్యలోనే పట్టుకుని, "ముసిలోడా, నువ్వు నోరు తెరిస్తే ఇట్టాంటి కూతలే కూస్తావు. నీ నాలిక పుచ్చిపోలేదే" అని కొబ్బరి చిప్పను తన ప్రక్కనఉన్న పిల్లవాని చేతికిచ్చి "ఇందు. ఆ కుడితిలో ఉండే నీళ్ళుతెచ్చి వాని ముఖాన చల్లు" అన్నాడు.

పిల్లవాడు కుడితిలోని నీళ్ళను కొబ్బరిచిప్ప నిండా తెచ్చాడు. ఆ నీటిని గూనివాడు రామచంద్రుని ముఖం మీదనూ, గొంతు మీదనూ చల్లి "ఒరే రామచంద్రా ఇసుకలో పడుకొని సల్లగా నిద్దర్లు చేస్తాఉండావు గదరా. లెయ్యి. లేచి కొంప చేరుకో. నీ పెండ్లాన్ని మాదిగోల్లెత్తుకపోయేరు కొంప చేరుకో" అనరచాడు.

మళ్ళీ అందరూ పగలబడి నవ్వారు. ఒకడు కొబ్బరాకు బాకా మీద ఊదుతూ సద్దుచేయసాగాడు. ఇంకొకడు రాగయుక్తంగా "నిదుర బట్టేనా నీకు భీమసేనా నిదుర బట్టేనా" అంటూ వీధినాటకపు పాటను గొంతెత్తి పాడసాగాడు.

రెక్కలు, కాళ్ళు నలిగిపోయిన కీటకం వలె రామచంద్రుడు ఇసుకనేలమీద కదిలాడు. అరచేతులను భూమిపైన వూనుకుని, తరవాత మోకాళ్ళపైన ఉంచుకుని, ఆ తర వాత ఆట నిలబడిఉన్న పిల్లవాని భుజాలను ఆధారంగా జేసుకుని అతడు నిలుచున్నాడు. అతని దేహం ఆపాదమస్తకం హూనమై

## విశాఖపట్నం సమస్య

జడివానలో
వానజడిలో
రోడ్లన్నీ కాలువలై
సంగీతాలాలపిస్తే,
ఏ అడుగులు ఎటువేస్తే
ఏ గుంటకు దిగిపోతుందో
తెలియని నడకల అలజడిలో
తెలుస్తుంది మా పూరి తడాకా,
పురపిథుల మజాకా,
పాపం ! ఫుట్‌పాత్‌కు పుట్టెడు దుఃఖం
గుండెల లోతుల్లోంచి
కన్నీటి ప్రవాహం.....
ఈతరాని చేతగానితనాన
సందట్లో సడాగం
తొంది చెప్పు
ఎవరిది తప్పు ?
"తప్పేమీ నాదికాదు
తప్పుకోండి ! తప్పుకోండి !
కాకుంటే అభిషేకం" అంటూ
వెనకాలే వస్తుందొక సిటీ బస్సు
విరగబడే వేగంతో,
వినుగెత్తే డబ్బా చప్పుడు హారన్‌తో
తడిసే అందాల పైకి
పరుగెత్తిన యువక హృదయం
పడనే పడింది గోతిలో,
మొలలోతు నీటిలో
తొలగించే బాధ్యతగల
మున్సిపలిటీ సిబ్బంది
శ్రద్ధ వహిస్తే తొలగదా ?
మనపాలిటి ఈ ఇబ్బంది !

—జో రా శర్మ.

ఉన్నది. దేహంలోని ప్రతికీలూ పట్టుదప్పినట్టున్నది. అతడు శక్తినంతటినీ కూడదీసుకుని నిఠారుగ నిలుచున్నాడు. నడుంలో శూలంతో పొడిచినట్లు కలుక్కుమన్నది. అతడు అటనున్న హరిజనులవందనీ ఒకసారి అసహాయతతో నిండిన కళ్ళతో చూసి, వెనుదిరిగాడు. కాళ్ళీడ్చుకుంటూ మాలపల్లి వైపు సాగాడు.

## 5

ఈదురగాలి వీస్తున్నది. రామచంద్రుడు అరుగుమీద లేచికూర్చున్నాడు. తెలతెలవారుతున్నది. తూర్పున కనిపిస్తున్న ఉషోరేఖలను చూస్తూ వీధి మెరుగుతున్నది. రామచంద్రుడు నిద్రచాలక పోవటంతో మండుతున్న కనులను పులుము కున్నాడు.

నాగ ఇంటిగడప మీద కూర్చుని ద్వారబంధానికి వీపు ఆనించి, గాలికి ఆడుతున్న చింత కొమ్మలను చూస్తూ ఉన్నది.

ప్రతిరోజు రామచంద్రుడు నిద్రలేవగనే నాగ ఏదోపనిలో లీనమై కనిపించేది. ఇంటి ముందు కలాపిచల్లుతూనో, పందులకు నీళ్ళు పెడుతూనో కనిపించేది. ఈపూట ఆమె కనుపించినతీరు అశుభసూచకంగా రామచంద్రునికి అనిపించింది.

రామచంద్రుడు అరుగుదిగి, "పనీపాట వదిలేసి మూదేవి పూనినట్టు కూర్చోనుండా వేందే. '' అన్నాడు.

నాగ తల తిప్పి అతని వైపు చూసింది.

రామచంద్రుడు తువ్వాలును విదిలించి భుజానవేసుకుని. "నా మొకాన కోతులాడతా ఉన్నట్టు చూస్తూ ఉండావేందే. లేచి కాలాపి చల్లి ఇంటిముందర ముగ్గుకర్ర యెయ్యి'' అన్నాడు.

నాగ చిరాకుతో నిండిన ముఖంతో చూడ సాగింది.

"నీకిప్పుడు ఏఁవిరోగఁవొచ్చిందే. ఈఇల్లు అప్పుడే మనది కాకుండా పోయిందంటావా? వాడెవుడో కోన్కిస్కాగాడొచ్చి కాయితం చూపించినంత మాత్రాన మనకొంప మనది కాకుండా పోతుందా?'' అలా అంటూ ఉండగానే రామచంద్రుని కంఠం పెరిగింది, "ఈ ఇల్లు నాదికాదనేటోడెవుడో రానీ. వాణ్ణి సరికి పొలిచల్లేసా. వానితల్లిని— ''అని భార్యవైపు తిరిగి. ''నువ్వులేచి ఇంటిముందు కలాపి చల్లుతావా లేకపోతే నీ నడుగు లిరగ తందునా?'' అనరిచాడు.

నాగ ఉలికి పడినట్లు లేచి, తలవెంట్రుకలను మెడమీద ముడివేసుకుంటూ పెరటివైపు సాగి పోయింది.

రామచంద్రుని కేకలకు అట నిద్రిస్తుండిన కిష్టుడు మేలుకున్నాడు. వాడు ఈత చాపమీద నుండి లేచి వొళ్ళు విరచుకున్నాడు.

రామచంద్రుడు వానివైపు చూస్తూ "నిలిగింది చాలుగాని లేచి మొకం కడుక్కోరా పటంగి యదవా. సద్దితాగి పందుల్నిడువు. పొద్దు లేల ఏరుకునతినీ.'' అన్నాడు.

కిష్టుడు లేచి, తన తలవద్ద ఉండిన వీధి నాటకపు పాటలపుస్తకాన్ని తీసుకెళ్ళి అరుగు మీద వేసి, కళ్ళలోని ప్రుసినితుడుచుకుంటూ పెరట్లోకి నడిచాడు. వాడు పెరట్లోని బండమీద ఇటుక రాతిని అరగదీసి పండ్లుతోముకోవడం మొదలు పెట్టాడు. నాగ ఇంటి ముందు కలాపి చల్లడం ప్రారంభించింది.

రామచంద్రుడు ఇంటిలోపలికెళ్ళి పొడుగాటి గడ్డపారను భుజాన పెట్టుకుని బయట కొచ్చాడు. దానిని ఇంటిముందు దిగవేసి, "ఎవడు ఇది నాయిల్లుకాదనేటోడు. ఈఇల్లు నాది. దీనిచుట్టూ ఉండే జాగా నాది ఈజాగాలో సలవ పందిళ్ళేసుకుంటా. ఆకుతోటలేసుకుంటా. నన్నడిగేటోడెవరు.'' అన్నాడు.

గడ్డపార భూమిలోపలకు జానెడు లోతు చొచ్చుకుపోయి నిఠారుగా నిలుచుంది. రామచంద్రుడు ఎవర్నీ ఉద్దేశించకుండా, కొంతసేపు రౌదమూ, కొంతసేపు దైన్యము తొణికిసలాడే కంఠంతో మాటలాడసాగాడు. అతడు గోచిని బిగించి కట్టుకుంటూ, "ఈని తల్లిని-ఈడేవి నాకు ఇనాంగా నాకీ నేల పట్టాజేసిచ్చినాడా? రొండేండ్లు; ఒక దినఁవా రెండుదినాలా; రొండేండ్లు గొడ్డుమాదిర వానింటో కష్టపడితే పట్టాజేసిచ్చినాడు. నేను జేసిన కష్టఁవంతా ఇప్పుడు కక్కమను, ఇల్లుకాలీజేస్తా'' అన్నాడు.

ఇంటిముందున్న వెంపలిచెట్లు మీద తుమ్మెదలు, సీతాకోకచిలుకలు ఎగరడం ప్రారంభించాయి. గడ్డిమీద మిడతలు మోకాళ్ళను వీపులపైన ఉంచుకుని వాటి కార్యక్రమాన్ని గురించి ఆలోచిస్తున్నాయి.

ఈపూట నుండి ఈ ఇల్లు తనది కాదనే సత్యం రామచంద్రుని మనసులో బాగానాటు

(35 వ పేజీ చూడండి)

సీరియల్

# మగదిక్కు

## పైడిపాటి సుబ్బరామశాస్త్రి

(గత సంచిక తరువాయి)

**జరిగిన కథ-4:** కొడుకు సూర్యానికి సరోజినిని యిచ్చి పెళ్లి చేయమని అన్న శేషయ్యని అడుగుతుంది చింపమ్మ. ఆస్తి, చదువు లేని సూర్యానికి సరోజినిని యివ్వటానికి ఒప్పుకోడు శేషయ్య. ఉన్న ఆస్తి సరోజిని చదువుకి కరిగిపోగా గత్యంతరం లేక హైస్కూల్లో టీచరుగా చేర్పిస్తాడు శేషయ్య. సూర్యం మంచి పురోహితుడుగా పేరు సంపాదించుకుంటాడు. ప్రయివేటుగా ఎం. ఎ. పూర్తి చేస్తుంది సరోజిని. తను తన భర్తకు ఎలా దూరమయ్యిందీ సరోజినికి చెప్తుంది తోటి టీచరు సురేఖ. తను తన సంపాదన దాచుకోవడం అన్నకి కంటగింపుగా వుందని అతని మాటలవల్ల గ్రహిస్తుంది సురేఖ. సురేఖ తండ్రి మరణిస్తాడు.

తండ్రిపై దుఃఖం ఆరోజు కారోజు అందరికీ తగ్గుతూ వచ్చింది సురేఖ దుఃఖం మాత్రం అందరి దుఃఖంవలె లేదు. స్కూలుకు మూడు రోజులే సెలవు పెట్టింది. మార్పు వుంటే దుఃఖం తగ్గుతుందేమోనని తర్వాత స్కూలుకు వెడుతూ వస్తూవున్నది. అతిమాత్ర ప్రయత్నంచేత దుఃఖాన్ని స్కూలులో నిగ్రహించుకున్నా, ఇంటికివస్తే మాత్రం ఆగేదికాదు. కట్టలు తెంచుకు పొంగి పారలేది.

ఇంటికి వచ్చినప్పుడు, అక్కచెల్లెళ్ళ పిల్లలనూ, అన్నదమ్ముల పిల్లలనూ, దగ్గరకు తీసుకొని, వాళ్ళతో కబుర్లు చెబుతూ కాలక్షేపం చేసేది.

"అక్కా! అన్నయ్యా, వదినే, నిన్నిక్కడ బాగా చూస్తున్నారా?" అని అడిగింది ఒక చెల్లెలు ఒకరోజున సురేఖను ఎవ్వరూ వినకుండా.

"చూడకేమే! బాగానే చూస్తున్నారు. చూడకుండానే రోజులు వెళ్ళుతున్నయ్యంటావా? అయినా నన్ను చూడవలసినదంటూ ప్రత్యేకం ఏముంటుంది? నేనంత చిన్నపిల్లనేమీ కాదుకదా! అన్నం పెడతారు. తింటాను. స్కూలుకు వెడతాను. తిరిగి యింటికి వస్తాను మళ్లీ అన్నం తింటాను. నిద్రపోతాను."

"అదికాదక్కా! అన్నం పెట్టినందుకు నీదగ్గర నెలకు ఎందరూపాయలు వసూలు చేస్తున్నారటకదా! అల్లా నువ్వు యిచ్చినా, నిన్ను సరిగా చూస్తున్నారా, లేదా, అని!"

"నాదగ్గర వాళ్ళు వసూలు చేసేదేమీలేదు. చెల్లీ! నాన్న ఇల్లా చెప్పాడు నాకు – 'అమ్మా! ఎవరి కుటుంబాన్ని పోషించుకోవడం వాళ్ళకు తప్పదు. నువ్వు యిక్కడ వుండవలసినదానవుకాని, చుట్టపుచూపుగా వచ్చి వెళ్లిపోయేదానవుకాదు. ఒక మనిషికి, ఇంకొక మనిషి, శాశ్వతంగా అన్నం పెట్టడమంటే, భారమేకదా! అందుచేత నువ్వు నెలకు ఒక వందరూపాయలు మీ అన్నకు సహాయం చేస్తే బాగుంటుంది. లెక్కలుచూసి ఇవ్వవలసివస్తే యాభై అరవై రూపాయలు చాలనుకో! కావలసిన పనిలో అల్లా చూడకూడదు. అల్లా చూస్తే, మేమేమయినా పూటకూళ్ళు పెడుతున్నామా అనే భావం వాళ్ళకు కలుగుతుంది. నేను చెప్పినట్లుగా యిస్తే నువ్వు వాళ్ళకి బరువని అనుకోరు. నీవల్ల వాళ్ళ లబ్ధి వాళ్ళ కుంటుంది. నువ్వు స్వస్థానంలో వుండే అవకాశం నీ కుంటుంది. అది నీకు దండి' అని. చెల్లీ! ఆ ప్రకారం నేను చేస్తున్నాను. మిగతా డబ్బు బాంకులో వేసుకుంటున్నాను. నాన్న చెప్పింది సబబుగా వుంది. నా డబ్బు నేను బాంకులో వేసుకుంటాను, నువ్వు మాత్రం నాకు ఊరికే శాశ్వతంగా అన్నం పెట్టమంటే ఏ అన్నయ్య పెడతాడు? ఏ వదినె ఊరుకుంటుంది? ఆ యింట్లో విడిగా గది తీసుకొని అన్నం వండుకు తింటే నాన్న బాధపడుతాడని ఆ పని చేయలేదు."

చెల్లెలు మాట్లాడలేదు. ఆలోచిస్తోంది.

"చెల్లీ! సొమ్ము ముట్టచెప్పినా, మొన్నటి దాకా నాన్న సింహమల్లే బ్రతికివున్నాడు కమక, నాకు నాన్న యింటిలో వుంటున్నాననే భావమే వుంది కాని, అన్నయ్య యింటిలో వుంటున్నానన్న భావమే కలుగలేదు. నాన్న పోయాడు కమక యిది అన్నయ్య యిల్లు అని అనుకోనవలసివస్తుంది. నాన్న చేసిన ఏర్పాటుకు నాకు సంబంధించినంతవరకు మార్పేమీ లేదు. నా అన్నం నేను తింటున్నా, నేను ఆడదాన్ని కనుక నాకు మగదక్షత వుండాలి. మిగిలిన అన్నదమ్ములు మిగతా ఊళ్లలో వుంటున్నారు. రక్తంపంచుకు పుట్టినవాళ్లలో యీ అన్నయ్యే నాకు మగదిక్కు. వడ్లతో తట్ట ఎండినట్లుగ వాడికీ నాకూ తప్పదు."

"మొన్నటిదాకా నాన్న బ్రతికివున్నాడు. ఒక ఏర్పాటు చేశాడని చెప్పావు. సరే! ఆ అన్నమయినా, విసుక్కోకుండా, కసుక్కోకుండా, అధికమాసపు తద్దినం వచ్చిపడిందని అనుకోకుండా, ఆప్యాయతతో పెడుతున్నారా?"

"మాకే పోట్లాటలూ లేవు. వాళ్లను గురించి నాన్నకు నేను ఎప్పుడూ ఏమీ ఫిర్యాదు చేయలేదు మనిషయిన తర్వాత ఎప్పుడో ఏదో విసుగు లేకుండా వుంటారా? భర్తమీద విసుక్కోవచ్చు. పిల్లలమీద విసుక్కోవచ్చు. ఎవరిమీదనైనా విసుక్కోవచ్చు. నన్ను వాళ్ల ఆప్యాయతతో చూస్తున్నారనే నేను అనుకుంటున్నాను. వాళ్ల చేసుకున్న వస్తువు నాకు పెట్టకుండా ఎప్పుడూ వుండలేదు. నేను వాళ్ల పిల్లల నెత్తుకొని ఎప్పుడయినా, ఏమయినా, కొనిపెట్టడం మానలేదు. నేను వాళ్ల సంరక్షణ చేస్తాను. వాళ్ల తల్లి దగ్గరకు వెళ్లినట్లే వాళ్లూ నా దగ్గరకు వస్తారు. సరేనా?"

"అక్కా! నువ్వు చెప్పకపోయినా, నీ సంగతి నాకు తెలుసులే!"

"ఏమి తెలుసే, నీకు! నేషం!"

"నువ్వు చెప్పి చెప్పి, సరేనా? అని అనడంలోనే నీ హృదయం తెలిసిపోయింది!"

"సరేనా? అంటే ఏమిటో అర్థం?"

"నీతో చెప్పడానికి ఇంతవరకు చాలు, సరేనా? అని అర్థం"

"నా సంగతి తెలిసిపోయిందన్నావు. ఏమి తెలిసింది?"

"నేను చెప్ప!" అని బుంగమూతి పెట్టింది చెల్లెలు. సురేఖ చెల్లెలి గడ్డం పుచ్చుకుంది.

చెల్లెలు వెంటనే కన్నీరు కార్చింది.

"అక్కా! ఎందుకు నా దగ్గర దాస్తావు? భాగ్యరేఖ అక్కతో బెజవాడ వదినె చెబుతూవుంటే అంతా విన్నాను."

"ఏమి విన్నావమ్మా! చెప్పు! మా అమ్మవు కాదూ!"

"నువ్వేమో, ఆఫీసరల్లే వచ్చి పీట ముందు కూర్చోవడం తప్ప ఇవతల చెంబు అవతల పెట్టవట! తానే సర్దుకుపోతోందిట! నెలకు వంద రూపాయలు అవతల పారవేస్తున్నాకదా, వీళ్లు ఎవరికోసం చాకిరీ చేస్తారనే ధీమా నీకు వుందిట! నాన్న ముఖం చూసి నీకు గంగమ్మ వదినె అన్నం పెడుతోందిట! నువ్వు ఇంటికి ఒక రోజున బాగా ఆలస్యంగా వచ్చావట! ఆ రోజునే నిన్ను వేరేచోట వుండి కాచుకు త్రాగమని చెప్పాలని అనుకుందిట! కాని పెద్దముండాకొడుకు బాధ పడతాడని వూరుకుందిట! ఇకముందు ఏమి జరుగుతుందో తెలియదట!"

సురేఖ వెంటనే కళ్లు మూసుకుని గోడకు జేరబడిపోయింది. చెల్లెలు గబగబా ముఖంమీద నీళ్లు కొట్టింది. సురేఖ కళ్లు తెరచింది. మాట్లాడింది.

"ఇక్కడ ఎవ్వరూ లేరుగా!"

"లేరు" అన్నది చెల్లెలు.

"పెద్దక్క ఏమందే?" అన్నది వెంటనే.

"నేను నీకు హిస్టీరియా వచ్చిందని ఖంగారు పడ్డాను అక్కా!"

"మూర్ఛ కాదుకాని, అల్లాంటిదే! నేను తట్టుకోలేకపోయాను."

"తేనె పట్టుకురానా?"

"వద్దు"

"నేను చెప్పింది బయటకు అనవద్దు. మనస్సులోనే పెట్టుకో."

"అంతే! కాని భాగ్యం అక్క ఏమంది? ముందు నాకది కావాలి?"

"గంగమ్మ వదినె చెప్పినదానికల్లా "అల్లాగా! అల్లాగా!" అంటూ వింటూ ఆశ్చర్యాన్ని ప్రకటిం

చింది. అన్నింటికీ 'ఊ' కొట్టింది. అక్కా ! మేము ఇక్కడ నాలుగు రోజులు వుండిపోయేవాళ్ళం. నీకోసం పుట్టింటివాళ్ళతో తగాదా పడతామా ?''

''బాగా చెప్పావు. నూరేండ్లు బ్రదుకు నా ఆయుస్సుకూడా పోసుకు బ్రదుకు !''

''అక్కా ! మనం ఆడవాళ్ళంకదా ! ఆడవాళ్ళుగా ఎందుకు పుట్టాం ?''

''భగవంతుడు పుట్టిస్తే పుట్టాం.''

''అది అల్లా ఉంచు. నేను చెప్పేది విను. ఇతరుల ఇళ్ళు ఉద్ధరించడానికి పుట్టాం.''

''సరే''

''ఉద్ధరిస్తున్నాం.''

''ఇంతకీ ఏమిటే నువ్వు చెప్పదలచుకున్నది ?''

''అంటే, ఆ యింటిని మన యిల్లును చేసుకుంటున్నాం. నీకూ ఒక ఇల్లు వుంటే, వదినె నిన్ను గురించి యిల్లా అనగలిగేదా ? విచారించవలసినది దానికిగాని, వదినె మాటలకు కాదు. వదినె శిరస్సున ఛత్రం వున్నదక్కా ! ఛత్రం వున్నది. అంటే మొగుడనే గొడుగు వున్నది. అందుచేత ఆమె మాట చలామణి అవుతుంది. కాని అక్కా ! ఆ గొడుగు నీకూ వుంది. కాని నీ నెత్తిన లేదు. అసలు ఆ గొడుగు క్రింద అప్పుడే ఎవరో దూరేశారు.''

''చిన్నతనమయినా, నీకెంత వివేకం వుందే !''

''ఏమి లాభం ? నోరు లేదుగా ! వదినెను ఎదిరించి నోరు మూయించలేను. ఒకవేళ అల్లా చేస్తే అన్నయ్య బాధపడతాడు. వాకిట్లోకి ఎప్పుడూ పిలవడు. ఎప్పుడయినా మనం అందరమూ కలిసేది హెచ్చుగా పుట్టింటిలో శుభకార్యాల్లోనే. మనం ఎంత తోబుట్టువులమయినా, అందరం ఒకేచోట వుండే అవకాశం వుందా ? లేదు. ఆడజన్మ కదే ! ఎవరి సంసారం వారిది. ఎందుకే ఏడుస్తావ్ ?''

''ఏడవడంలేదు.''

''నేనూ చూసేదాన్ని కాదంటే ఎల్లా చెప్పు ఈ కళ్ళు చెప్పేది అబద్ధంకాదే ! నువ్వు నవ్వవా?''

సురేఖ ఊరుకుంది.

''తోబుట్టువులంతా ఒకేచోట వుండడానికి ఒకే మార్గం వుంది.''

''ఏమిటది ?'' ఆసక్తిగా అడిగింది సురేఖ.

''సింపిల్ ! అందరం ఒక్కణ్ణే పెళ్ళాడడం ! తర్వాత కీచులాడుకున్నా ఫర్వాలేదు !''

సురేఖ నవ్వింది.

''ఇప్పుడు చెబుతున్నా విను. నా మొగుడు రత్నం. అంటే నేను చెప్పినట్లుగా వింటాడు. సత్యభామ మాటయినా కృష్ణుడు వినకపోవచ్చును, నా భర్త నామాట వినకపోవడమంటూ లేనేలేదు. జీతం నాలుగు అంకెలమీద వుంది. ఉత్తరదేశంలో గంగాతీరంలో హాయిగా వున్నాం. నువ్వు నీ ఉద్యోగం వదలిపెట్టిసెయ్ ! అసలు ఆడదానికి ఇంకొకచోట ఉద్యోగం ఏమిటే ! భర్త దగ్గర చేస్తే చెయ్యాలి ఉద్యోగం ! మా యింటికి వచ్చేసెయ్ ! నిన్ను జీవితాంతం వరకూ నేను పోషిస్తాను. కావలిస్తే కాగితంకూడా వ్రాసి యిస్తాను, నా భర్తను ఎదురుకుండా పెట్టుకొని. నువ్వు మా యింట్లో ఏ పనీ చేయనక్కరలేదు. మా పిల్లలు నీ పిల్లలే అనుకొని వాళ్ళకు చదువుమాత్రం చెప్పు ! వస్తావా, అక్కా !''

''రాను.''

''నువ్వు వున్న స్థితిలో, అంత వెంటనే, అంత కచ్చితంగా, ఎల్లా సమాధానం చెప్పావే అక్కా ! నాకు చాలా ఆశ్చర్యంగా వుంది. నీది వజ్ర సంకల్పమల్లే వుంది !''

''నాది వజ్ర సంకల్పమే !''

''ఎందుకు రావు ? కారణం చెప్పకూడదా? '

''చెల్లీ ! వివరిస్తే నీవు బాధపడతావు. ఒక్క వాక్యంలో చెబుతాను—దూరపు కొండలు నునుపు !''

ఆ చెల్లెలు తెల్లబోయింది.

## 14

మరురోజున ఆ చెల్లెలూ సురేఖా తిరిగి ఏకాంతంగా కలిశారు.

''దూరపు కొండలు నునుపు — అన్న ఒక్క వాక్యంతో నాకు నీమీద వున్న అభిమానమును తేలికగా తీసివేశావు సురేఖా !'' అన్నది చెల్లెలు.

''చెల్లీ ! నన్ను నీవు అపార్థం చేసుకోకు ! నామీద నీకు అభిమానం వున్నదని నాకు తెలుసు. నామీద నీకు యెంత అభిమానం లేకపోతే, నమ్మదగినట్లుగా వున్న గంగమ్మ వదినె మాటలు నమ్మకుండా, నీవు నాతో తీసుకువచ్చి ఎందుకు చెబుతావు ? జీవితకాలం పోషిస్తానని ఎందుకంటావు ?

కాని, నేను చెప్పే మాటలుకూడా విను. నేను నీకంటె పెద్దదానను. సత్యం యెప్పుడూ అంత ప్రియంగా వుండదు. వదినె చెప్పిన మాటలు, నీవు నమ్మకపోయినా, వినడానికి ఎంత ప్రియంగా వున్నై ? భాగ్యం అక్క నమ్మేటంత ప్రియంగా వున్నై నిజం చెప్పాలంటే ! యెందుకని ? అవి నిజంకాదు కనుక ! అయితే సత్యంగా వుండి, ప్రియంగా వుండేటట్లు చెప్పడం యెక్కడో కొందరికే సాధ్యమవుతుంది. నాలాటివాళ్ళకుకాదు! అందుచేతనే దూరపు కొండలు నునుపు అని వెంటనే నేనన్న మాట కట్టె విరిచి పొయిలో పెట్టినట్లుగా వుంది నీకు ! నీకేకాదు. అన్న తర్వాత నాకూ అల్లాగే వుంది !

చెల్లీ ! ఒకరిమీద ఒకరికి మనకి వున్న అభిమానం దూరంగా వున్నప్పుడే నిలుస్తుంది. ఎంత తల్లీ తోడయినా అంతే ! నిజానికి అన్నయ్య చెడ్డవాడుకాడు. తాను డబ్బు ఇబ్బందిలో వుండడం చేత ద్రవ్యాశ కలిగింది. వచ్చే మార్గంలేదు. ఎదురుగా నేను కన్పిస్తున్నాను. నాకు బాంకులో ఎకౌంటు



వున్నది. వెంటనే దృష్టి నాపై మళ్లింది. "దీనికే మయినా బిడ్డా, పాపా ? దీని పొమ్ము మనకెందుకు పెట్టరాదు?" అనే భావం వచ్చింది. ఈ భావం ముందు వదినెకు కలిగివుండవచ్చు. తర్వాత అన్నయ్యకు కలిగి వుండవచ్చు. ముందు వెనుకలకేం ? ఇద్దరికీ కలిగింది. నేనివ్వకపోతే వాళ్ల మనస్సులో నేను చెడ్డదానను. వాళ్లు నన్ను ఒత్తిడి చేస్తే నా దృష్టిలో వాళ్లు చెడ్డవాళ్లు. ఈ పరిస్థితి ఎందుకు వచ్చింది ? అన్నా చెల్లెళ్లిద్దరూ ఒకచోట వుండడంవల్ల వచ్చింది. నేనే దూరంగా వుంటే వదినె అన్నయ్యకు చాడీలు చెప్పే అవకాశం లేదు. గౌరవం పెరుగుతుంది.

నేనేమీ పిచ్చిదాన్ని కాదు. నాకు వేరే గతి లేక, నాన్న వున్న స్థానం కనుక, ఆడదానికి మగదిక్కు అంటూ ఒకటి వుండడం అవసరం కనుక, ఇక్కడ పడివున్నాను. నేను నీ కోరికమీద మీ యింటికే వచ్చాననుకుందాం. కొన్నాళ్లు దివ్యంగా వుంటుంది ! అసలు నాలాంటిది వుద్యోగం మానుకోవడం నేల విడచి సాము చేయడం. వుద్యోగం వుంటేనే నాకు రోజులు వెళ్లడం కష్టంగా వుంటే, ఉద్యోగం వదలుకొని, ఉత్తరదేశం వెళ్లి నీ యింట్లో అన్నం తింటూ, నీ సంతానానికి చదువు చెప్పే వుద్యోగంలో ప్రవేశించడం అంత న్యాయం కాదు.

పడ్డచోట వెతుక్కోమన్నారు. నేను అత్త యింట్లో వుండాలి. లేదా పుట్టింట వుండాలి. చెల్లెలి యిల్లు చేరడం న్యాయం కాదు. 'ఉన్న ఊరు – కన్న ప్రజ' అన్నారు. విజయవాడ నే నెరిగిన ఊరు. సమస్యలు వస్తే వాటిని ధైర్యంగా ఎదుర్కొని పరిష్కారం చేసుకోవాలి. అసలు మనం చేసుకునే దేమిటి ? కాలమే పరిష్కారం చేస్తుంది !"

"కొన్నాళ్లు దివ్యంగా వుంటుందన్నావు, తర్వాత బాగుండదనేగా అర్థం ! నీకల్లా ఎల్లా తోచింది నా విషయంలో ?"

"చిట్టితల్లీ ! నాకు అల్లా తోచింది. అంతే ! ఏమీ అనుకోకు. నేను వివరించలేను."

ఆ చెల్లెలు అక్కడనుండి విచారంలో వెళ్లిపోయింది ఆమె వెళ్లిన వెంటనే సురేఖ పెద్ద అక్క భాగ్యరేఖ వచ్చింది. గది తలుపు రాగానే బిడాయించింది.

"సురేఖా !"

"అక్కయ్యా !"

"అశుభకార్యాలకు పైనుంచి వచ్చినవాళ్లు, వెళ్లేటప్పుడు తాము వెడుతున్నామని చెప్పి వెళ్లరాదు. అందుచేత నేను రేపు వెళ్లిపోతున్నానని, ముందుగా నీకు చెప్పడానికి వచ్చాను. నాన్న పోయినందుకు బెంగ పెట్టుకోకు. మా అందరికంటె ఎక్కువ కాలం, నాన్న దగ్గర నువ్వు గడిపావుకనుక, నీకు ప్రతి క్షణం నాన్న జ్ఞాపకం రావడం సహజం. ఎల్లకాలం అందరూ వుండరు. అల్లా వుంటే సృష్టి నడువదు. కొంతకాలం కొంత విచారం వుండడం తప్పదు. కాని బెంగ మాత్రం పెట్టుకోబోకు. తల్లి తర్వాత తల్లి అంతదానను కనుక నీకు చెప్పడానికి వచ్చాను."

"అల్లాగే అక్కా !"

"మా అందరి బ్రదుకులూ వేరు. నీ బ్రదుకు వేరు. కాలు నొచ్చినా, చేయి నొచ్చినా, ముసలితనం వచ్చినా, మాకు సంపాదించి పెట్టడానికి కొడుకు లున్నారు. వాళ్లనుబట్టి చాకిరీ చేయడానికి కోడళ్లున్నారు సరే ! మొగుడున్నాడు. మా జీవితాలు ఎల్లాగో అల్లా వెళ్లిపోతాయి.

కాని నీ జీవితం అల్లా వెళ్లేది కాదు. ఎంత తల్లి తోడయినా, డబ్బు లేకపోతే చూసేవాళ్లు ఎవరూ వుండరు డబ్బు లేనివాడు డుబ్బుకు కొఱగాడు. కనుక ఖర్చు తగ్గించుకొని డబ్బు కూడబెట్టుకో ! తెలిసిందా?" అనేటప్పటికి భాగ్యరేఖ కంఠం రుద్ధమయింది. అనుకోకుండా ఏడ్పు వచ్చింది.

"తెలిసిందక్కయ్యా !" అన్నది గద్గద స్వరంతో సురేఖ.

"అత్తా ఒక ఇంటి కోడలే – అని సామెత. అత్త స్థానంలో వున్నదీ ఆడదే, కోడలి స్థానంలో వున్నదీ ఆడదే. ఇద్దరూ మహిళలే అయినా, వారి వారి స్థానాలనుబట్టీ వ్యవహారం మారుతూ వుంటుంది. ఇది జీవితంలో ఒక సత్యమైన విషయం.

"నువ్వు యీ ఇంటికి ఆడపడుచువి. గంగమ్మ వదినె యీ ఇంటికి కోడలు. రాజయ్య పెళ్లిలో లాంఛనాలు, నీకు జరిగినా, నాకు జరిగినా, ఆడపడుచు స్థానాన్ని పురస్కరించుకునే జరిగినై. అంతేకాకుండా యీ ఇంట్లో ఎప్పుడయినా ఒక శుభకార్యం జరిగితే, నీకుగాని, నాకుగాని, వదినె గుడ్డ పెట్టి మర్యాద చేస్తుంది. వదినె చేస్తుందంటే అర్థం అన్నయ్యకూడా అని.

"తన పెళ్లి కాకముందు వదినె యీ ఇంటికి పరాయిది. పెళ్లి అయి కాపురానికి వచ్చిన కొంత కాలానికి యీ ఇంటికి ఆమె యజమానురాలు. కనుక యీ గృహంలో అధికారం ఎప్పుడూ యీ గృహిణిదేకాని, మనదికాదు. తెలిసిందా ?"

"తెలిసింది."

"ఈ విషయం ఎఱిగి బ్రతికితే కలతలుండవు. ఎవరికీ యిబ్బందులూ వుండవు. "ఈ యింట్లో నేను పుట్టాను. అన్నయ్య రక్తం పంచుకు పుట్టాను. వాడికి వదినె పెళ్లాము కాబట్టి నా స్థానం అన్నయ్య స్థానం లాంటిది. నా మాటే నెగ్గాలి" అనే ధోరణిలో నువ్వు వుండవని అనుకుంటున్నాను. నేను ఇల్లా అంటున్నానంటే యిదివరకు నువ్వు అల్లా వున్నావని నేను అన్నానని మాత్రం అర్థంచేసుకోకు. పెద్దదానిగా చెప్పవలసిన మాట చెప్పాను. అంతే !"

"సరే ! అక్కయ్యా !"

"మీ ఇద్దరిమధ్యా అంటే గంగమ్మ వదినెకూ నీకూ మధ్య అన్నయ్య ఎవరిప్రక్క మొగ్గవలసి వుంటుంది ?"

"వదినె ప్రక్కనే."

"ఎందుచేత ?"

"జీవితాంతం కలిసి వుండవలసినది ఆ మనిషితో కనుక."

"సురేఖా ! నువ్వు వివేకవంతురాలవే."

భాగ్యరేఖ కాసేపాగి యిలా అంది :

"వాస్తవానికి అన్న వదినె ప్రక్కనే ఎప్పుడూ మొగ్గవలసిన అవసరం లేదు. ఎవరిది ధర్మమయితే వారిప్రక్కనే మొగ్గాలి: కాని, తన తోడుకూ, తన నీడకూ, తగాదా వచ్చినప్పుడు సాధారణంగా పురుషుడు తన భార్య సంగతే చూసుకుంటాడు. అంటే, తన సంగతే చూసుకుంటాడు దానిని స్వార్థం అని అను – ఏమయినా అను – తన కాపురానికి తాను చిచ్చు పెట్టుకోడు. నిబ్బరంగా ధర్మంకోసం నిలబడి పెళ్లాన్ని లొంగతీసుకునే పురుషులు చాలా అరుదుగా వుంటారు. కనుక ఇంటి ఆడపడుచు, తన సోదరుని క్షేమం దృష్ట్యా, అతడు ఇరుకులోపడే పరిస్థితులు కల్పించకూడదు."

"కూడదు."

భాగ్యరేఖకు దుఃఖం ఆగడంలేదు. గంగమ్మ చెప్పిన మాటలు సురేఖతో చెప్పడం యిష్టంలేదు. దానివల్ల పరిస్థితి విషమించి, అన్నతో యివాళే తెగతెంపులు చేసుకొని వెడితే వెళ్ళిపోవచ్చు. దాని పరిణామం యెల్లా వుంటుందో ! అని భయపడి చెప్పలేదు. అందుచేత ఆ ప్రసంగంలో ముఖ్యాభిప్రాయాన్ని తన ఉపదేశంతో మిళావుచేసి పెద్దది



చెప్పినట్లుగా చెప్పింది. ఎన్నడూ స్వరంతో ఇల్లా అన్నది :

"సురేఖా! ఇవన్నీ నేను చెప్పేది, నువ్వు అల్లాంటి పరిస్థితులు కల్పిస్తున్నావని కాదు. నీకు మంచీ చెడ్డా చెప్పే, అమ్మా, లేదు. మనం మళ్లీ ఎన్నాళ్ళకు ఎప్పుడు ఏవిధంగా కలుస్తామో తెలియదు.

నాకు తోచిన మాటలు, పిచ్చో, వెర్రో, చెబుతున్నాను. చెప్పాలని అనుకుని చెబుతున్నాను. ఇది నాన్న ఇల్లు కనుక నా యిల్లు అని మాత్రం అనుకోబోకు, నాన్న లేడు. ఇది వదినె యిల్లు అనుకుని, మగదిక్కు లేక—"

దుఃఖం బాగా పొంగిపోయింది. అణచుకున్న కంఠంతో "అన్నయ్య ఆశ్రయంలో వున్నానని అనుకొని రోజులు యెల్లాగో అల్లా వెళ్ళబుచ్చుకో!"

అని కౌగిలించుకొని సురేఖ ముఖంమీద ముఖం పెట్టి ఏడ్చింది.

"అల్లాగే, అక్కా!" అని సురేఖ, భాగ్యరేఖ కన్నీళ్ళు ఒకప్రక్క తుడుస్తూనే తానేడ్వడం ప్రారంభించింది.

"వదినెతో నీ కభిప్రాయభేదం ఎప్పుడయినా వచ్చిందా?" అని ప్రశ్నించింది భాగ్యరేఖ.

"వాళ్ళ యింట్లో వుండి, వాళ్ళతో అభిప్రాయభేదం తెచ్చుకొని నేను బావుకునేదేమిటి అక్కయ్యా!"

భాగ్యరేఖ సురేఖకు, ఈ యిల్లు వాళ్ళ ఇల్లు అని తన నోటితో ఉపదేశించినా, ఆ మాటే సురేఖ నోట వచ్చేటప్పటికి వినడానికి యెంతో బాధపడింది.

"నా ఉద్యోగం నేను చేసుకుంటూ, తీరికగా వున్నప్పుడు ఏదయినా సహాయం చేస్తున్నాను — ముఖ్యంగా పిల్లల సంరక్షణ విషయంలో."

"ఒక మాట చెబుతాను, విను. ఏమీ అనుకోకు. ఒక మనిషికి ఇంకొక మనిషి బరువు. విధాయకమైన కుటుంబంలోనివాళ్లు కాకపోతే. ప్రత్యేకంగా బరువు మోసేది లేకపోయినా ఎదుటి మనిషి బరువనే అనిపిస్తుంది. అందులో నీలాటివాళ్ళు రెట్టింపు బరువు. ఇంటి పనిలో సాధ్యమయినంతవరకు, వదినెకు సహాయపడడమే మంచిది."



"అల్లాగే, అక్కా!"

"నేను రాకముందు, నీదగ్గర నుండి వెళ్ళిన చెల్లాయి ఏమని చెప్పింది?"

"గంగమ్మ వదినె, నీతో చెప్పిన మాటలన్నీ చెప్పింది?"

భాగ్యలక్ష్మి నిర్విణ్ణురాలయింది. తాను చెప్పనిద్దై, రహస్యపు మాటలన్నీ చెప్పిన కితాబు ఆ చెల్లెలికి దక్కింది. తాను హృదయం విప్పి చెప్పినందుకు సురేఖ ఏమనుకుంటుందో, అనుకుంది.

"అయితే, నీకు టపా ముందే చేరిందన్న మాట!" అన్నది నవ్వుతూ.

"చేరింది. నువ్వు సూత్రప్రాయంగా చెప్పావు. అది వివరంగా చెప్పింది. అంతే, తేడా!"

"చివరకు ఏమంటుంది?"

"నా ఉద్యోగం వదలివేసి ఉత్తరభారతం నన్ను రమ్మంటుంది. తన భర్త తన మాట వినేవాడనీ, జీవితాంతం పోషిస్తానని, తన పిల్లలకు చదువు చెప్పడంతప్ప వేరేమి పని చేయనక్కరలేదనీ, అంటుంది."

"నువ్వేమన్నావు?"

"దూరపు కొండలు నునుపు — అన్నాను. అందుకు బాధపడింది."

"రేఖా! నువ్వు బ్రదుకగలవు. నీకు వివేకముంది."

"ఏమి వివేకం అక్కా! సుఖపడడం చేతకానిది."

"అలిగి అత్తింటికీ, చెడి చెల్లెలు యింటికి వెళ్ళకూడదని సామెత. ఇది మగవాడికి సంబంధించిన సామెత అయినా, సోదరి యింటికి పోకూడదన్నంత వరకూ ఆడదానికీ వర్తిస్తుంది. ఇక మార్గం లేకపోతే ఆ విషయం వేరు. పరాయిచోటికి పోయేకన్న మెరుగు."

"ఎందుకు వెళ్ళకూడదని అంటావు?"

"ఒక యింట్లో వున్నప్పుడు దాని మొగుడు దీనితోకాని, ఇది దాని మొగుడుతోకాని చొరవగా మాట్లాడవచ్చు. అది తప్పదు. అందులో పరాచికమాడే వరుసకూడాను. అది అపోహలకు దారితీసి, ఇల్లుకల ఆవిడ, ఇల్లు లేని ఆవిడను ఇంట్లోనుండి ఎప్పుడయినా లేచిపొమ్మనవచ్చు. లేదా ఇల్లుకల ఆవిడే అనుమానించి ఆత్మహత్య చేసుకోవచ్చు. అనుమానం, సాహసం చాలమందికి సహజ లక్షణాలు కదా! సోదరి అయినా వేరే ఆధారం లేనిదని తేలేటప్పటికి దాసీదానిక్రింద చూడడం ప్రారంభించవచ్చు కొంతకాలం పోయిన తర్వాత.

ఇక నీ విషయం. నువ్వు వయస్సులో పెద్దదానవయిన కారణంచేత, దాని శ్రేయస్సు కోరి, ప్రతి విషయంలో జోక్యం కలుగచేసుకోవాలని ప్రయత్నించవచ్చు ఇంట్లో పెత్తనం చలాయించవచ్చు. దాని నది సహించలేకపోవచ్చు. దానికి దాని భర్త యిష్టపడవచ్చు. అది పొరపులకు కారణం కావచ్చు. ఎంత చేతకాని ఆడదానికయినా, తన యింట్లో తన పెత్తనం చలామణి కావాలనే

'సీత గీత దాటితే'లో కవిత

అధికార వాంఛ సహజంగా వుంటుంది. ఇంకొక మనిషి మంచిమాట చెప్పినా ఆమె మాట చెల్లడం తనకి యిష్టం వుండదు. నీ మఱది తన పెళ్ళాం పెట్టిన చారుకన్న నువ్వు పెట్టిన చారు బాగున్న దన్నా డనుకో! ఇక నీమీద పుట్టెడు అసూయ ముంచుకువస్తుంది. ఈ మగవాళ్ళు అల్లా అనకుండా వుండరు. నోరు మూసుకుని తినిపోరు. ఏదో ఒకటి అంటూవుంటారు.

ఏ కారణంచేత ఎప్పుడు పొరపులు కలుగుతనో చెప్పడం కష్టం. ఒకప్పుడు చాలా చిన్నవిషయాలు, పెద్ద అభిప్రాయ భేదాలకు దారి తీయవచ్చు. తన పిల్లలు నీదగ్గర ఎక్కువ మాలిమి అయితే, తల్లిగా, దాని కది యిష్టంలేక, వాళ్ళను నీ దగ్గరకు రాకుండా చేయాలని ప్రయత్నిస్తే, నీకే కష్టం కలుగవచ్చు.''

''అక్కయ్యా! నువ్వు ప్రతిదీ నిశితంగా ఆలోచిస్తావు. నేను యింతగా ఆలోచించలేదు. ఏదో కొంత ఆలోచించాను. ఎరిగినచోటు వదలి, క్రొత్తచోటుకు పోరాదనీ, ఉద్యోగం వదలుకు తీరా వెడితే, ఏదయినా తేడా వస్తే, జీవనాధారం లేక ఇబ్బందిపడవలసి వస్తుదన్నంతవరకే ఆలోచించాను.''

''రేఖా! తేడా వస్తే — అని అన్నావే! ఆ తేడా ఎల్లా రావడానికి వీలున్నదో కొంతవరకు నేను విశదీకరించాను.''

ఇంతవరకు వచ్చిన తర్వాత, తన శ్రేయస్సు కోరిన అక్కకు, తన కడుపులోని మాటలను చెప్పాలనుకున్నది సురేఖ.

''భాగ్యం అక్కయ్యా!''

''చెప్పమ్మా! మళ్ళీ ఎన్నాళ్ళకు కలుస్తామో! అందుకనే రాగానే తలుపు బిడాయించాను.''

''ఉన్న సంగతి దాపరికం లేకుండా చెబుతున్నాను. నాన్న ఒకటి రెండు రోజులకు పోతాడనగా, నేను, మా, కో టీచర్ సరోజిని ఇంటికి వెళ్ళి ఆలస్యంగా ఇంటికి చేరవలసివచ్చింది. రాజయ్యన్న నామీద కేకలువేశాడు. అందులో తప్పు ఏమీ లేదు. వదినె ఎగసనతోసింది. కారణం నాకు తెలియలేదు.

అన్నయ్య ఆ సందర్భంలో మాట్లాడుతూ, ఉద్యోగంలో చేరిన క్రొత్తలో నేను జీతమంతా తన చేతులలో పోసేదానిననీ తర్వాత నాన్న చేసిన ఏర్పాటు వల్ల, నెలకు వందరూపాయలు మాత్రమే ఇవ్వడం వదినెకు కోప కారణ మయిందని బయటపెట్టాడు. ఆ రాత్రే నాన్న నాదగ్గరకు రహస్యంగా వచ్చి, ఇది నీ అన్న అభిప్రాయంకూడా అనీ, వాళ్ళు చిరాకు కల్పించే మాటలను అన్నా, ఉద్రేకంలో సొమ్ము పూర్తిగా వాళ్ళ చేతుల్లో పోయవద్దనీ, అల్లా చేస్తే వార్ధక్యంలో యిబ్బంది పడతావనీ చెప్పి, నీ భర్త ఎప్పుడయినా స్వీకరిస్తానంటే వెళ్ళిపొమ్మని చెప్పాడు. వదినె ఏమి చెప్పినా దాని వెనుక వున్నది ద్రవ్యాశ.''

''అదా, అసలు సంగతి!'' అని భాగ్యరేఖ సురేఖను ఒళ్ళోకి తీసుకుంది. సురేఖ మీద గంగమ్మ నేరాలు ఎందుకు మోపుతోందో, భాగ్యరేఖకు పూర్తిగా అర్థమయి, ముడి విడిపోయింది. సురేఖ తల నిమిరింది.

''సురేఖా! ఇంతమంది బలగం వుండికూడా, మేమందరమూ, నీకు లేనివాళ్ళమే అయిపోయాము సుమా! ఒక్కడు — అంటే, నీ మగడు, నీదగ్గర లేకపోతే, నువ్వు అందరకూ అలుసయిపోయావు. భర్త విలువ అంటే జీవితంలో అదీ!'' అని కన్నీళ్ళు కార్చింది.

''అక్కయ్యా! మనం గదిలో చాలాసేపు కూర్చున్నాం. తలుపు ఎవ్వరో తట్టుతున్నారు. తీస్తాను'' అని సురేఖ లేచి గడియ తీసింది. తీస్తే ఎవ్వరూ కనబడలేదు.

## 15

కర్మకు వచ్చినవాళ్ళంతా ఎవరి దారిని వాళ్ళు వెళ్ళిపోయారు. ఉన్నన్నాళ్ళూ వాళ్ళు సురేఖతో పిచ్చాపాటీ మాట్లాడినవారేకాని, భాగ్యరేఖ మోస్తరుగాగాని, మరొక చెల్లెలు మోస్తరుగాగాని లోతుగా మాట్లాడినవారు కాదు. ఇంట్లోవాళ్ళే మిగిలారు. తండ్రి పడుకునే గది వంక చూసినప్పుడల్లా, సురేఖకు పుట్టెడు దుఃఖం కలుగుతోంది. చెల్లెలి మాటలూ, పెద్దక్క ఉపదేశమూ ఆమె మనస్సులో గాఢ ముద్ర వేసుకున్నాయి. చెవిలో రింగుమని మ్రోగుతూనే వున్నాయి.



సురేఖకు తండ్రి పోయినాడన్న విచారం క్రమ క్రమంగా తగ్గుతూనేవున్నా, ఆ యింటిలో తన స్థితిని ఎల్లా నిలుపుకోగలనా అనే విచారం, అధికం కావటం ప్రారంభించింది. వదినె తనమీద మోపిన నేరాలకు అవకాశం యివ్వకుండా భాగ్యరేఖ సలహాలను అమలుజరుపడం తన కర్తవ్యంగా భావించింది. అంతకంటె గత్యంతరం కనుచూపు మేరలో కన్పించలేదు.

సురేఖలో వచ్చిన యీ మార్పును రాజయ్య, గంగమ్మ, స్పష్టంగా గమనించారు. తన చెల్లెలు తన భార్యకు సహాయపడుతున్నందుకు రాజయ్య సంతోషించాడు. సురేఖ, రాజయ్య కొడుకులకూ, కూతుళ్ళకూ: తలలు దువ్వడం, నీళ్ళు పోయడం, పాఠాలు చెప్పడమేకాకుండ ఇతరమైన పనులుకూడా చేస్తోంది. తన పిల్లలు సురేఖ దగ్గర మాలిమి అయి తనకు కాకుండా పోతున్నారనే బాధ గంగమ్మకు కలిగింది. కాని చేసేది ఉపకారం అవడంవల్ల కొంతకాలం ఏమీ అనలేక ఊరుకుంది.

కసి పోక మసి పూసుకున్నారన్న సామెత. కసి కలిగినవాళ్ళు దానిని తీర్చుకోవడానికి ఏదో పని చేస్తూవుంటారు. ఇతరులమీద తీర్చుకోవడం చేతకాకపోతే తామే మసి పూసుకుంటారు. లేపి స్వరూపం అది. గంగమ్మకు కలిగిన బాధ కసిగా మారడానికి యెంతోకాలం పట్టలేదు. సురేఖను చేసేదేమీలేక, అల్ప విషయాలకు, కొడుకులనూ, కూతుళ్ళనూ కొట్టడం ప్రారంభించింది. అంటే ఆవిధంగా సురేఖమీద తన కుటుంబానికి పూర్తిగా జీతం యివ్వడంలేదని వున్న కసిని తీర్చుకోవడం ప్రారంభించింది.

''అత్తా! అమ్మ కొట్టింది చూడు.'' అని పిల్లలు ఏడుస్తూ సురేఖ దగ్గరకు వెళ్ళబోతూ వుంటే, గంగమ్మ రెక్క పుచ్చుకు గుంజేది. వాళ్ళు యింకా ఏడ్చేవాళ్ళు. ''అదేమిటి, వదినే!'' అని సురేఖ కల్పించుకుంటే, ''చాల్లే చెప్పవచ్చావు! గారాబం యెక్కువయి నీమూలానే పిల్లలు చెడిపోతున్నారు. మర్దనం గుణవర్ధనం! పిల్లలను అప్పుడప్పుడు చిట్టి మొట్టికాయలు వేస్తూవుండాలి. వాళ్ళు ఏడుస్తూవుండాలి. బాలానాం రోదనం బలం'' అని గంగమ్మ సమాధానం చెప్పేది. పిల్లలు దీనంగా తన వంక చూస్తూవుంటే సురేఖ గ్రుడ్లనీరు గ్రుడ్ల క్రుక్కుకునేది.

''అత్తయ్యా! నీ దగ్గరకు వెళ్ళవద్దని మా అమ్మ చెప్పింది.'' అన్నాడొక మేనల్లుడొకరోజున సురేఖతో.

''మానివేయి'' అన్నది సురేఖ.

''మానలేను అత్తయ్యా!''

''మానలేకపోతే దెబ్బలు తింటావు నాయనా! మీ అమ్మ వీపుమీద కనుక, చరిచిందంటే, అయిదు వేళ్ళూ అల్లా అంటి అట్టు తేలుతుంది. నేను చూడలేను బాబూ!''

''తింటే, పోనీలే!'' అని వచ్చాడు. ఆ క్షణంలో తల్లి కళ్ళబడలేదు కనుక ఆ శిక్షను ఆనాటికి తప్పించుకున్నాడు.

''అత్తయ్యా! అమ్మ యింట్లో లేదులే! నాకు జడ గబగబా వేసెయ్!'' అని వచ్చింది ఒక పిల్ల ఒకరోజున.

''వచ్చిన తర్వాత చూడదటే, పిచ్చిపిల్లా! చూస్తే నేను వేసినట్లు యెల్లాగూ తెలుస్తుంది. నీ అంతట నువ్వు వేసుకునేటంత దానవని ఎప్పుడూ అనుకోదు. అప్పుడు నాకు చివాట్లు! నీకు విసిరాట్లు!''

''విసిరాట్లంటే ఏమిటి అత్తయ్యా!''

''చూడగానే వెంటనే గబగబా పెట్టేవి చివాట్లు! ఆగి ఆగి, విసిరి, విసిరి, పెట్టేవి విసిరాట్లు!''

''అత్తయ్యా! మా అమ్మకు నువ్వు జడ వేస్తుంటే చూస్తే మంట. కాని వేసేసిన తర్వాత చూస్తే అంత వుండదు. అందుచేత వూరుకుంటుంది. గబగబా వేసెయ్.''

''నామీద మీ అమ్మ కసలు మంట ఎందుకే?''

''ఏమో! నాకేం తెలుస్తుంది! నువ్వు మా యింట్లో వుంటున్నావుగా! అందుకనేమో!''

(30 వ పేజీ చూడండి)




# * సినిమా విశేషాలు *

## సవేరాలో సత్యచిత్ర ప్రారంభం

సత్యచిత్రవారి సినిమా స్కోప్ వర్ణచిత్రం డిశంబర్ 30న హోటల్ సవేరాలో ప్రారంభమైంది. ద్వితీయ లగ్నంగా 31న కూడా షూటింగు జరిగింది. హోప్‌లీగా జరిగిన ప్రారంభోత్సవానికి, ఆత్మీయులు, పత్రికా ప్రతినిధులు వచ్చి, నిర్మాతలకు శుభాకాంక్షలు తెలిపారు. "నటరత్న" గారిపై దర్శకుడు రాఘవేంద్రరావు మొదటి షాటును తీశారు. (విన్సెంట్ ఛాయాగ్రహణ దర్శకుడు)

జనవరి పదినుంచి, షూటింగు చివరి రోజు వరకు సత్యచిత్ర సభ్యులు ముదుమలై అడవిలో తాత్కాలిక వాసము చేస్తున్నారు. ఈ స్కోప్ చిత్రానికి మహదేవన్ సంగీతాన్ని, జంధ్యాల రచన్ను, విన్సెంట్ ఛాయాగ్రహణాన్ని, పట్టాభి ప్రొడక్షన్ను నిర్వహిస్తున్నారు.

ఎన్టీఆర్ నటిస్తున్న మొదటి కలర్ స్కోప్ యిది. ఇందులో జయప్రద నాయిక. ప్రధాన పాత్రలను జయసుధ, రమాప్రభ, పండరీబాయి, గుమ్మడి, సత్యనారాయణ, నాగభూషణం, శ్రీధర్, రాజబాబు, కవిత మరియు జగ్గయ్య పోషిస్తున్నారు. నిర్మాతలు . సత్యనారాయణ... సూర్యనారాయణగార్లు.

## జయచిత్రకు రెండు వేషాలు

రవి శంకర్ పిక్చర్స్ జనవరి యిరవై రెండున సారధీ స్టుడియోస్‌లో ప్రారంభిస్తున్న చిత్రంలో జయచిత్ర రెండు వేషాలను వెయ్యడం గమనించదగిన విషయం.

చిత్రం పేరు "తల్లిలేని పిల్ల." ఈ చిత్రానికి డి. వి. నరసరాజు సంభాషణలను, సత్యం సంగీతాన్ని సమకూరుస్తున్నారు.

ఎడిటర్‌గా పేరుంది. దర్శకుడుగా పేరు తెచ్చుకోగల ప్రజ్ఞ వుంది. పేరు సత్యం. "తల్లిలేని పిల్ల" చిత్రానికి ఎడిటర్ ... డైరెక్టర్ కూడా ఆయనే.

ఈ చిత్రంలోని ప్రధాన పాత్రలను మురళీ మోహన్, సత్యనారాయణ, మోహన్‌బాబు, గిరిబాబు, కాంతారావు, గోకిన రామారావు, సుకుమారి, రమాప్రభ పోషిస్తున్నారు.

"బంగారక్క" చిత్రాన్ని నిర్మించిన సునీల్ యీ చిత్రాన్నికూడా నిర్మిస్తున్నారు.

## మల్లెపువ్వు

సమత ఆర్ట్స్ జనవరి తొలిరోజున ప్రారంభించిన రంగుల చిత్రానికి "మల్లెపువ్వు" అని పేరు పెట్టినట్టు, నిర్మాత ఛటర్జీ చెప్పారు.

ఈ చిత్రానికి ఆచార్య ఆత్రేయ రచయిత. చక్రవర్తి సంగీత సారధి. (నాలుగు పాటలు రికార్డు చేశారు.)

మొదటి షెడ్యూలు వాహినీలో, ఎస్. జి. ఎస్. కళ్యాణ మండపంలో జరిగింది.

"హీ-మాన్" యీ చిత్రంలో ధరిస్తున్న పాత్ర, ఆయన నటజీవితంలో మధురానుభూతిని కలిగిస్తుంది. ఆయన సరసన లక్ష్మి నాయికగా నటించ, సహాయ పాత్రలను జయసుధ, సీతాలత, కె. విజయ, శ్రీధర్, రావు గోపాలరావు, రాజబాబు, మాడా, కె. వి. చలం పోషిస్తున్నారు.

సమత ఆర్ట్స్‌కు వెంకటరత్నం, అంకిరెడ్డి, కృష్ణారావు వరుసగా ఛాయాగ్రహణాన్ని, కూర్పును, శిల్పాన్ని నిర్వహిస్తున్నారు లక్ష్మి ఫిలింస్ విడుదల

## కృష్ణ సత్య

లావణ్య పిక్చర్స్ నిర్మిస్తున్న "గంగ... యమున... సరస్వతి" జనవరి ఆరున ప్రారంభమైంది. 'ఆంధ్రపత్రిక' రాధాకృష్ణగారు స్విచ్ ఆన్ చేశారు

ఏడవ తారీఖున యీ విలేఖరి సెట్టుకు వెళ్లాడు, ఒక విచిత్ర సంఘటన చూచాడు.

మురళీమోహన్ కృష్ణుడుగా, రోజారమణి సత్యభామగా సాక్షాత్కరించారు. చూపరులు "కృష్ణ సత్య"లను సర్టిఫై చేశారు.

మురళీమోహన్ కూడా కృష్ణుడి వేషానికి బాగానే వుంటాడు అనెడి అభిప్రాయాన్ని అక్కడున్న వాళ్లు అన్నారు. (పరిశ్రమకు ఏలుగురు కృష్ణు లయ్యారన్నమాట.)

దిన వార ఫలాలను "ఆంధ్రపత్రిక"లో తెలిపే మహేష్, దర్శకత్వం నిర్వహిస్తున్న మొదటి చిత్రం "గంగ... యమున... సరస్వతి" కథను, మాటలను, చిత్రానువాదాన్ని దర్శకుడే సమకూర్చారు.

ఈ చిత్రంలో సత్యనారాయణ, నాగభూషణం, గిరిబాబు, షావుకారు జానకి, శుభ, జయమాలిని, మాడా, సూర్యకాంతం ముఖ్య పాత్రలను పోషిస్తున్నారు.

సంగీతానికి చక్రవర్తి, ఛాయాగ్రహణానికి మల్లియిరానీ అధిపతులు. విజయా పిక్చర్స్ విడుదల

'యువ్వనం మురిపించింది'లో
కమలహాసన్, శ్రీప్రియ





# సినిమా

'ఈ తరం మనిషి'లో శోభన్ బాబు, జయప్రద

## కొత్త నిర్మాతల నెల్లూరు లొకేషన్

మదరాసు విజయరాఘవాచారి వీధిలో వెలసిన ద్వారకా ఆర్ట్స్ ప్రొడక్షన్స్‌ను రాఘవరావుగారు, వెంకటేశ్వరరావుగారు స్థాపించారు. వీరి ప్రథమ ప్రయత్నానికి ప్రత్యగాత్మ ముఖ్య సారధి.

ఈ సంస్థ తలపెట్టిన కథా సంగీత బలం వున్న చిత్రానికి భొల్లిముంత రచన్ను, చలపతిరావు సంగీతాన్ని సమకూరుస్తున్నారు.

జనవరి ఆరున నెల్లూరులో షూటింగు ప్రారంభమైనట్టు, మార్చికి చిత్ర నిర్మాణం పూర్తవుతుందన్నట్టు, తెలిసింది.

కాలం కలిసివస్తే, దానిని అవరోధించే శక్తి యెవరికీ వుండదుగాబోలు. జయసుధ టైం చాలా బాగుండబట్టే, ద్వారకా ఆర్ట్స్ ప్రొడక్షన్స్ ఎంపిక

'బంగారక్క'లో శ్రీదేవి

చేసిన అపురూపమైన కథలో, నాయిక వేషం లభించింది. జయసుధకు స్టార్ వేల్యూను పెంచే శక్తి ఆ పాత్రకు వుంది.

## గడుసు అమ్మాయి!

ద్వారకా ఆర్ట్స్ ప్రొడక్షన్స్ నిర్మిస్తున్న చిత్రానికి "గడుసు అమ్మాయి" అని పేరు పెట్టారు. టైటిల్ పాత్రను జయసుధ, కథానాయకుడుగా మురళీమోహన్ నటిస్తున్న "గడుసు అమ్మాయి" చిత్రంలో జగ్గయ్య, అల్లురామలింగయ్య, మోహన్‌బాబు, లక్ష్మీకాంత్, కబీర్‌దాస్, జాన్సీ, స్నేహలత, వంకాయల సత్యనారాయణ ప్రధాన పాత్రధారులు.

ఈ చిత్రాన్ని పూర్ణ (ఆంధ్ర), నవభారత్ (రాయలసీమ), శ్రీ తారకరామ (తెలంగాణా) విడుదల చేస్తారు.

ఈ చిత్రానికి పని చేస్తున్న వి. ఎస్. ఆర్. కృష్ణారావు, చలపతిరావు, భొల్లిముంత, హేమచందర్, కృష్ణస్వామి, సురేష్, సుబ్రమణ్యం వారి వారి శాఖల్లో అనుభవజ్ఞులే.

పూలమ్మే పిల్ల దగ్గర్నుంచి, కారున్న వనిత వరకు పెరిగే జీవితాన్ని స్వయంప్రతిభతో ఆర్జించుకున్న ఒక అమ్మాయి కథ "గడుసు అమ్మాయి" చిత్ర కథ, అన్నారు ప్రయోగాత్మక ప్రత్యగాత్మ.

## తెలుగులో శ్రీప్రియ

తమిళ చిత్రాలలో అగ్రశేణి తారగా ప్రకాశిస్తున్న "శ్రీప్రియ"కు తెలుగు చిత్రంలో హీరోయిన్ ఛాన్సు బహుచక్కని చిత్రంలో దొరికింది.

గోపీకృష్ణా యింటర్నేషనల్ తలపెట్టిన "చిలకమ్మ చెప్పింది" చిత్రంలో నారాయణరావు సరసన శ్రీప్రియ, రజనీగంధ ప్రక్కన సంగీత నటించగలరని, నిర్మాత చెలసాని గోపీ చెప్పారు.

"పాలకొల్లు" ప్రాంతంలో "చిలకమ్మ చెప్పింది" చిత్రం ఫ్రిబవరిలో ప్రారంభం అవుతుందని, చిత్ర సమర్పకుడు చేగొండి హరిబాబు వెల్లడించారు.

ఈ చిత్రానికి గణేష్‌పాత్రో రచన్ను, విశ్వనాథం సంగీతాన్ని, లోకనాథ్ ఛాయాగ్రహణాన్ని నిర్వహిస్తున్నారు.

"చిలకమ్మ చెప్పింది" చిత్రానికి ఈరంకి శర్మ దర్శకుడు. ఆయన గురువు కె. బాలచందర్ పర్యవేక్షకుడు, లక్ష్మీఫిలింస్ విడుదల.

## అనిల్‌కు రామకృష్ణ

ప్రముఖ దర్శకుడు తాతినేని ప్రకాశరావుగారు తన మనవడు చిరంజీవి అనిల్ పేరిట స్థాపించి, అనిల్ ప్రొడక్షన్స్‌లో "నటరత్న రామారావు, నటశేఖర కృష్ణ... నట సహజ శోభన్‌బాబు"గార్లు నటించారు.

ప్రకాశరావుగారి అబ్బాయి చిరంజీవి లక్ష్మీవరప్రసాద్ ఒక తమిళ చిత్రాన్ని కొని తెలుగులో తనే డైరెక్ట్ చేస్తున్న విషయాన్ని గత వారం పాఠకులకు తెలిపాను.

ఒక మూగపిల్ల జీవితం మీద అల్లబడిన కథకు రామకృష్ణ నాయకుడుగా, జయసుధ నాయికగా ఎంపిక అయ్యారు. సహాయ పాత్రలను అల్లు రామలింగయ్య, రమాప్రభ పోషిస్తున్నారు.

రచన్ను భమిడిపాటి, సంగీతాన్ని చలపతిరావు సమకూర్చగలరని, ఫిబ్రవరి నుంచి ఏప్రిల్ వరకు షెడ్యూల్సు జరుగుతాయని, నిర్మాణ నిర్వాహకుడు కృష్ణమూర్తి చెప్పారు. తారకరామ... నవభారత్... శ్రీ తారకరామ పంపిణీదారులు.





'అందాల రాజా'లో దీప



డి. వి. ఎస్. రాజుగారి ''జీవితనౌక'' చిత్రంలో జయప్రద నాయిక. కె. విశ్వనాథ్ దర్శకుడు.

సమత ఆర్ట్సులోకి ''మల్లెపువ్వు'' చిత్రంలో లక్ష్మి నాయిక, వి. మధుసూధనరావు దర్శకుడు.

రామకృష్ణ ఆర్ట్సువారి ''గడుసు పిల్లోడు'' చిత్రంలో జమున నాయిక, కె. బాపయ్య దర్శకుడు.

నిర్మాత నరసింహారెడ్డి నిర్మిస్తున్న చిత్రంలో సీప నాయిక, పి. సుబ్రమణ్యం దర్శకుడు.

లోకేశ్వరీ ఆర్ట్సు పిక్చర్స్‌వారి ''అగ్నిజ్వాల'' చిత్రంలో జయప్రద నాయిక, సి. ఎస్. రావ్ దర్శకుడు.

### "రావు"కున్న ప్రత్యేకత

''ముత్యాలముగ్గు'' చిత్రం రావుగోపాలరావుకు తెచ్చి యిచ్చిన ఫలితము అనితర సాధ్యమైనది. అలాగే ''భక్త కన్నప్ప'' చిత్రం రావుకిచ్చినది, ''జేబుదొంగ'' చిత్రం గోపాలరావుకిచ్చినది, ఆయన కృషిని మెచ్చి యిచ్చినదేగాని, సరదాగా యిచ్చిందికాదు.

ఇటీవల విడుదలైన ''రాజా'' చిత్రం అంతటి ప్రేక్షకాదరణ పొందడానికి రావుగోపాలరావు నటన ముఖ్యకారణం అన్నది జనమెరిగిన నిజము.

ప్రేక్షకలోకంలో రావుగోపాలరావుకి ప్రత్యేక విలువ వుండడానికి కారణం... ఆయన వైవిధ్యం వున్న పాత్రలను ఎంపిక చెయ్యడం... ఆ పాత్రలకు పూర్తి న్యాయం చెయ్యడం.

అడ్డమైన పాత్రను అంగీకరించే మనస్తత్వం ఆయనకు అరంభకాలంనుంచిలేదు. కాబట్టియికరాదు.

ప్రస్తుతం రావుగోపాలరావు నటిస్తున్న చిత్రాలు, సమత ఆర్ట్సువారి ''మల్లెపువ్వు'' నాగేష్ దర్శకత్వంలో ''మొరటోడు'' మారుతీ కంబైన్స్‌వారి ''జీవనరాగం'' రామవిజేతావారి ''లంబాడోళ్ళరాందాసు'' నళినీ శ్రీ నికేతన్ వారి ''పచ్చబొట్టు'' శ్యాంబెనగల్ దర్శకత్వంలో ఒక చిత్రం. జగపతి ఆర్ట్ పిక్చర్స్‌వారి ''బంగారు బొమ్మలు'', వాసు ఇంటర్నేషనల్ వారి చిత్రం.

నటుడుగా రావుగోపాలరావుగారిని ఎంతగా అభినందించాలో, రచయితగా కూడా ఆయన్ను అభినందించాలి. నిజం తెలిసిన వాళ్ళు గోపాలరావుగారి రచనా శక్తిని ప్రశంసించక మానరు.

విడుదలయిన ఎన్నో హిట్ చిత్రాలకు, వస్తున్న మరెన్నో చిత్రాలకు ''రావు''గారి కలం అజ్ఞాత శక్తిగా వుపయోగపడుతూంది.

'రాజా కోరిన రోజా'లో శివాజీ, వాణిశ్రీ



### చక్రవర్తి వేసిన మంచి పాట

వాహినీ ''డి'' థియేటర్లో మారుతి కంబైన్స్ వారి ''జీవనరాగం'' వర్ణచిత్రానికిగాను, చక్రవర్తి ఒక మంచి పాటను రికార్డు చేశారు.

చేసే ప్రతి పాట హిట్ అవుతుందని ఎవ్వరూ చెప్పలేరు గాని, కొన్ని పాటలను ''గ్యారంటీ హిట్'' అని సులభంగా చెప్పొచ్చు.

అలా ''గ్యారంటీ హిట్'' అని చెప్పదగిన పాటను, వేటూరి సుందరామ్మూర్తి వ్రాశారు. సుశీల మహా గొప్పగా పాడింది.

''ఏ రాగమని పాడను

ఏ తీగనే మీటను'' అనెడి పల్లవితో ప్రారంభమవుతుంది పాట. ఇటీవల విన్న అయిదారు మంచి పాటలలో యిదొకటి. ఈ పాటను



''అగ్రనటి''పై చిత్రీకరిస్తారు గనక, మరింత గొప్పగా వుంటుంది.

### శివాజీ నిర్ణయం

మారుతి కంబైన్స్‌వారి ''జీవనరాగం'' వర్ణ చిత్రంలో ''తమిళ నటసామ్రాట్'' ఒక ముఖ్య పాత్రను పోషిస్తున్నారు. ఆయన పోర్షన్‌కు, యింకొకరిచేత వాయిస్ యిప్పించడానికి నడిగర్ తిలకమ్ అంగీకరించలేదు. తనే డైలాగు చెప్పడానికి నిర్ణయించారు. రోజూ, తెలుగు వాక్యాలను ఓ గంట ప్రాక్టీస్ చేస్తున్నారు.

''జీవనరాగం'' చిత్రంలో కృష్ణంరాజు, జగ్గయ్య, రావు గోపాలరావు, రాజబాబు, వాణిశ్రీ, జయసుధ, జ్యోతి, నిర్మల ప్రధాన పాత్రధారులు.

శ్రీ ఎ. గోపాలకృష్ణ నిర్మించే యీ చిత్రానికి స్వామి ఛాయాగ్రహణాన్ని, చక్రవర్తి సంగీతాన్ని, సత్యానంద్ రచన్ను నిర్వహిస్తున్నారు.

యువదర్శకుడు శేఖర్‌కు యీ చిత్రం ''హిట్'' అయ్యేది తథ్యము. లక్ష్మి ఫిలింస్ విడుదల.

### జులై నుంచి శోభన్ చిత్రం

''రాజా'' సాధించిన ఆర్థిక విజయం శోభన్‌కు వున్న పాపులారిటీకి ప్రత్యక్ష నిదర్శనం.

శోభన్‌బాబుగారితో మాత్రమే చిత్రాన్ని నిర్మించాలని అనుకునే అయిదుగురిలో మారుతీ కంబైన్స్ అధినేత ఒకరు.

శ్రీ కుమార్‌ను అడిగాను. ''శోభన్ చిత్రం ఎప్పుడని''. జులై నుంచి అని లక్ష్మికుమార్ గారన్నారు.

సంవత్సరాని కొక చిత్రం, శోభన్‌తో నిర్మించే దృఢ నిర్ణయాన్ని ఎ. ఎల్. కుమార్ తీసుకున్నారు.

జులై నుంచి ప్రారంభమయ్యే శోభన్ చిత్రానికి రాఘవేంద్రరావు, చక్రవర్తి, సత్యానంద్, స్వామి తప్పనిసరిగా వారి శాఖలను నిర్వహిస్తారు.

మనకున్న మంచి సంస్థలలో మారుతీ ఒకటి.

### శోభన్ చిత్రాల నాయికలు

మన ''అందాలరాజు'' నటిస్తున్న చిత్రాలన్నీ వెరైటీ కథలను గొనివుండడం ఎంత నిజమో, ఆయన చిత్రాల నాయికలు వేర్వేరుగా వుండడం ఎంతో ఆనందదాయకము.

# సినిమా



'ఈనాటిబంధం ఏనాటిదో...'లో కృష్ణ, జయప్రద

***మాణిక్య వీణ***

స్వయం శక్తితో "సహజ కవి" అయిన మల్లెమాల, తెలుగు రచనా రంగంలో ఆవిర్భవించిన మణిదీపం అని చెప్పే ధైర్యం యీ కలానికి వుంది.

ఇప్పుడున్న మన రచనా దిట్ట లనేకులకన్నా "మల్లెమాల" మిన్న అని ఋజువయ్యే రోజు "ముత్యాల పల్లకి" విడుదలయ్యే రోజు అన్నది యీ విలేఖరికి ఏర్పడిన అభిప్రాయం.

ఇటీవల మల్లెమాలగారిని కలిసినప్పుడు, ఆయన తర్వాతి చిత్రంయొక్క డిజైన్ను నాకు చూపించారు.

చిత్రం పేరు "మాణిక్య వీణ" ఎంత మహోత్కృష్టంగా వున్నదో, ఆ డిజైను అంత గొప్పగా వుంది.

"కథ... మాటలు... చిత్రానువాదం... పాటలు" మల్లెమాలగారి సృష్టి. సంగీతానికి సత్యం, ఛాయాగ్రహణానికి దేవరాజ్ అధిపతులు.

***జూన్ నుంచి సురేష్‌కు***

జగపతి ఆర్ట్ పిక్చర్స్ వారి "బంగారు బొమ్మలు" వర్ణ చిత్రం షూటింగు జరుగుతున్న

'సావాసగాళ్లు'లో కృష్ణ, కూచి గోపాలకృష్ణ



జనవరి రోజుల్లో, సురేష్‌కు కాల్‌షీట్లు ఎప్పట్నుంచి అని, హీరో నాగేశ్వరరావుగారిని యీ విలేఖరి ప్రశ్నించాడు.

"ఫిబ్రవరికి ప్రసాద్ ఆర్ట్ పిక్చర్స్, జగపతి ఆర్ట్ పిక్చర్స్ చిత్రాల నిర్మాణం పూర్తవుతాయి. ఫిబ్రవరి నుంచి ఏప్రిల్ వరకు సుగుణా పిక్చర్స్‌కు డేట్స్ యివ్వబడ్డాయి.

జూన్ నుంచి సురేష్ రామానాయుడుగారికి, "దేవదాసు మళ్లీ పుట్టాడు" చిత్ర నిర్మాతలకు కాల్‌షీట్లు వుంటాయి", అన్నారు నటసామ్రాట్.

రామారావుగారి "చాణక్య ... చంద్రగుప్త" చిత్రంలో ఒక్కరోజు వర్కు మాత్రం తనది మిగిలివుందని, అక్కినేనిగారు చెప్పారు.

***అంగీకరిస్తే లక్ష్మి!***

మనకున్న విలక్షణమైన నటీమణుల్లో లక్ష్మి ఒకర్తి. ఆవిడ బహు భాషల్లో బిజీగా వుండడం వల్ల, తెలుగు చిత్రాలను ఎక్కువగా అంగీకరించడం లేదు.

లక్ష్మి చేస్తేనా, ఆమె ధాటికి ఎవరూ ఆగలేరు.

లక్ష్మి నటించిన "ఈ తరం మనిషి" ఆమె నటిస్తున్న "మల్లెపువ్వు" చిత్రాలు నే వ్రాసిన



'ప్రేమ రేఖలు'లో ఒక దృశ్యం

నిజాన్ని, ప్రేక్షకులచేత అవును అనిపిస్తాయి.

లక్ష్మిని పరిపూర్ణత నందుకున్న కళాకారిణిగా పేర్కొనవచ్చు. ఆమెలోని ప్రతిభను, గ్లామరును యావద్భారతం ప్రశంసించక మానదు.

తెలుగు రంగంలో వాణిశ్రీ తరువాత నటిగా మార్కును తెచ్చుకునే అర్హత లక్ష్మికి మాత్రమే వుందని వాదించే ప్రేక్షకులు ఎక్కువమంది వున్నారు.

'సీతారామ వనవాసం'లో ఒక దృశ్యం

# ఇప్పుడు! చురుకైన జీవనంకోసం. శక్తినిచ్చే 'యింధనాన్ని' సేవించండి.




# బూస్ట్

## మాల్ట్ చాకొలెట్ మిల్క్ డ్రింకు

మీ కార్యక్రమాన్ని ప్రతి రోజూ ఉత్సాహంగా ప్రారంభించడంకోసం మీకు కూడా, రైలు మాదిరిగా, యింధనం కావాలి. శక్తినిచ్చే యింధనం మిమ్మల్ని రోజల్లా చురుకుగా వుంచి ఎకాఎకి పనులు చేసుకునేటట్లు చేస్తుంది. అందుచేతనే ప్రతి ఉదయం మీకు బూస్ట్ కావాలి. ముఖ్యంగా పనిలోనూ, ఆటల్లోనూ అదనపు శక్తిని వినియోగించే మీ పిల్లలకి కావాలి. వారికి బూస్ట్ యివ్వండి. ఇది కొత్త మాల్ట్ చాకొలెట్ మిల్క్ డ్రింకు. పౌష్టికాహారం గురించి సంపూర్ణంగా తెలిసిన 'హార్లిక్స్' ఉత్పత్తిదారులు తయారు చేసినది బూస్ట్‌ని పూర్తి మీగడ పాలు, గోధుమ, బార్లీ మాల్ట్, కోకోలతో తయారు చేసారు. ఇందులో సహజమైన విటమిన్లు, ఖనిజాలు వున్నాయి.

బూస్ట్‌లో, యిటువంటి మరే యితర చాకొలెట్ డ్రింకులోను లేనంత ఎక్కువగా పాలు వున్నాయి. బూస్ట్‌లో మరింత ఎక్కువగా పాలు వున్నాయంటే, మీ పిల్లలు పెరగడానికి మరింతగా పోషణ పదార్థాలు, మరింతగా మాంసకృత్తులూ లభిస్తాయన్నమాట. బూస్ట్‌లో ఎక్కువగా పాలు వుండటంవల్ల ఎక్కువగా మీగడగా వుంటుంది. మీకు ఆ రుచి తెలుస్తుంది.

అంతేకాదు, బూస్ట్‌కి, మీ కుటుంబమంతా కూడా ఎంతో యిష్టపడే మాల్ట్ చాకొలెట్ రుచి, సువాసన వున్నాయి. మీ రోజుని ప్రారంభించేందుకు యిది ఉత్తేజకరమైన మార్గం — ప్రతి రోజూ

రెండు సైజులలో లభిస్తుంది.

## 'హార్లిక్స్' ఉత్పత్తిదారులనుంచి.

B-4133-Tel.

# సినిమా

### సుగుణా పిక్చర్స్‌లో ఇద్దరు 'మహా'లు

బాపట్ల వాస్తవ్యులు శ్రీ ఎమ్. శేషగిరిరావు కొత్తగా స్థాపించిన సుగుణా పిక్చర్స్ జనవరి 31 న తన తొలి చిత్రాన్ని, అక్కినేనిగారి స్టుడియోలో ఆరంభిస్తున్నారు.

అక్కినేనిగారు అనేక పాత్రలను అద్వితీయంగా పోషించిన మాట నిజమే అయినా, సుగుణా పిక్చర్స్‌లో ఆయన ధరిస్తున్న పాత్ర సరికొత్తది.

నాగేశ్వరరావుగారి గెటప్‌లో "నావల్టీ" వుండే యీ వర్ణ చిత్రానికి ఆచార్య ఆత్రేయ, మహాదేవన్, సెల్వరాజ్, జి. వి. సుబ్బారావు, హరిశ్చంద్రరావు, ఆర్. శ్రీనివాసరావు ముఖ్య సాంకేతిక సారధులు.

విక్టరీని మాత్రమే చవిచూస్తున్న ముగ్గురు విజేతలు యీ చిత్రంలో కలిశారు. అక్కినేని... వాణిశ్రీ... మధుసూదనరావుగార్లు.

సుగుణా పిక్చర్స్ వారి వర్ణ చిత్రంలో దీప, జయమాలిని, విజయలలిత, హలం సహాయ పాత్రలను పోషిస్తున్నారు.

జగ్గయ్యగారిది ప్రేక్షకులు కోరే పాలిషిడ్ పిలని వేషం.

### కేంద్ర మంత్రికి ఆహ్వానం

కేంద్ర టూరిజమ్ మంత్రి మన కొత్త రఘురామయ్యగారిని, నిర్మాత శేషగిరిరావు తన చిత్ర ప్రారంభానికి ఆహ్వానించారు. ఆయన అంగీకారాన్ని తెలిపినట్టు తెలిసింది.

ఒక కేంద్ర మంత్రిని ఆహ్వానించి కొత్త సాంప్రదాయానికి దారితీసిన సుగుణా పిక్చర్స్ అధినేతను అభినందిస్తున్నాను

### విజయవాడలో బంగారు బొమ్మలు

జగపతి ఆర్ట్ పిక్చర్స్ ఈస్ట్‌మన్ కలర్‌లో నిర్మిస్తున్న "బంగారు బొమ్మలు" చిత్రం, జనవరి 15 నుంచి, ఫిబ్రవరి మొదటి వారం దాకా జరిగే విజయవాడ షెడ్యూలుతో పూర్తవుతుంది అని, దర్శక... నిర్మాత రాజేంద్రప్రసాద్‌గారు చెప్పారు.

రెండున్నర లక్షల ఖర్చుతో, నిర్మించిన "భవంతి"లో "బంగారు బొమ్మలు" షూటింగు (విజయవాడలో) జరుగుతుంది.

"బంగారు బొమ్మలు" వర్ణచిత్రంపై ప్రేక్షకులు ఎన్నెన్నో ఆశలు పెంచుకుంటున్నారు. అందరి కళ్లు ఆ చిత్రంపైనే వున్నాయి.

జగపతి సంస్థలో అక్కినేనిగారి చిత్రం వస్తుందంటే, ప్రేక్షకులు ప్రత్యేకమైన శ్రద్ధను, ఆసక్తిని ప్రదర్శిస్తారు. ఆయన నటించిన చిత్రాలన్నీ హిట్ కావడం ఒక కారణం... రాజేంద్రప్రసాద్‌గారి నిర్మాణ... దర్శక దక్షతపై వున్న నమ్మకం మరో కారణం.

ప్రేక్షకులు తమ అభిమాన కథానాయకుడ్ని ఎలాంటి పాత్రలో చూడాలని వుత్సాహపడుతున్నారో, అట్టి నవరసభరితమయిన పాత్రను, "బంగారు బొమ్మలు" చిత్రంలో ఆయన పోషిస్తున్నారు.

ప్రధాన పాత్రలను మంజుల, జగ్గయ్య, సత్యనారాయణ, రావు గోపాలరావు, రాజబాబు, కె. వి. చలం, ధూళిపాళ, అంజలీదేవి, సూర్యకాంతం, ఛాయాదేవి పోషిస్తున్నారు.

"బంగారు బొమ్మలు" చిత్రానికి అతిరధులు నలుగురు వున్నారు. దర్శకుడు రాజేంద్రప్రసాద్, రచయిత ఆత్రేయ, ఛాయాగ్రహణ దర్శకుడు వెంకటరత్నం, సంగీత దర్శకుడు మహదేవన్‌గార్లు.

అన్నపూర్ణా ఫిలింస్‌కు అత్యధిక లాభాలను ఆర్జించగల చిత్రం "బంగారు బొమ్మలు".

— శ్రీనివాస్



'ఊరుమ్మడి బ్రతుకులు'లో సత్యేంద్రకుమార్, విజయభాను

## మగదిక్కు

(23 వ పేజీ తరువాయి)

"ఇది మీ యిల్లుటే!"

"కాదా ఏమిటి ?"

"మా నాన్న యిల్లు నా యిల్లు కాదుటే!"

"అమ్మా! ఎంతాశ! మా యిల్లు కాకపోతే నీ యిల్లా ? నీ మొగుడు కట్టించాడా ? నువ్వు జడ వెయ్యకపోతే వెయ్యకపోయావులే! ఈ యిల్లు మాదే !"

"సరేలే! యీ యిల్లు నీదే గొడవచేయకు. నువ్వు గంగమ్మ వదినె కూతురివే సరేనా ?"

ఆ పిల్ల నవ్వింది. "అల్లా ఒప్పుకో !" అంది.

"నువ్వు చెప్పింది నిజం తల్లీ ! అజ్ఞానురాలవయినా నిజమే చెప్పావు. నా మొగుడు కట్టించలేదు. మొగుడు కట్టిస్తేకాని, సంపాదిస్తేకాని, ఏర్పడ్డ ఇంట్లోనే ఆడదానికి అధికారం!" అని కంట నీరు పెట్టుకుంది.

"అత్తయ్యా! నేను అల్లా అన్నానని కోపం వచ్చిందా ? మేము బొమ్మలాట లాడుకున్నప్పుడు అనుకున్నట్టుగా అనేశాను."

"అవునమ్మా ! పేరుకు అవి బొమ్మలాటలు కాని, పెద్దవాళ్ళ జీవితాలను గురించిన ఆటలేనమ్మా. నువ్వు ఎల్లా అన్నా ఫర్వాలేదు. చిన్నపిల్లవు. నీమీద నాకు కోపం ఎందుకమ్మా ! అయినా కోపంవచ్చి నేను చేసేదేమిటి ? పేదవాని కోపం పెదవులచేటు ! రా, జడ వేస్తాను."

సురేఖ మేనగోడలికి అందంగా జడ వేసింది. గంగమ్మ వచ్చి చూసింది. ఎవ్వరినీ ఏమీ అనలేదు. కూతురిని దగ్గరకు పిలచింది. వచ్చింది. కూర్చోమంది. కూర్చుంది. వేసిన జడ ఊడతీసింది. కూతురు కుక్కినపేనల్లే కూర్చుంది. మళ్ళీ జడ వేసింది. సురేఖ కళ్లవెంట రెండు బిందువులు రాలినై.

కొంతసేపయిన తర్వాత ఆ పిల్ల సురేఖ దగ్గరకు వచ్చింది.

"అత్తయ్యా! చూశావా ? మా అమ్మ గంగమ్మ కాదు గింగానమ్మ! మంచి జడ విప్పేసి పిచ్చి జడ వేసింది. మా అమ్మకు పిచ్చెత్తినట్లుందత్తయ్యా! ఏమన్నా అంటే, అట్టు తిరగేస్తుందని నేనేమీ అనలేదు" అన్నది.

"ఏమీ అనకుండా వుండడం చాలా మంచి పని. మౌనం ఎంత మంచిదనుకున్నావు ! అసలు మొదటి జడే, పిచ్చి జడ ! ఇదే అందమయిన జడ !"

"నువ్వు అల్లా అంటే నమ్మడానికి, నేనేమయినా పిచ్చిదాని ననుకున్నావా ? అల్లా అనుకోకు !" అని సురేఖవంక అలా చూస్తూ వెళ్లిపోయింది ఆ పిల్ల.

[ఇంకా వుంది]

# తండ్రిప్రేమ

జయధీర్ తిరుమల రావ్




**తండ్రి తన వద్దకు వచ్చినందుకు సూర్యానికి చాల ఆనందమైంది.** రమణయ్య అంతకన్న ఎక్కువే సంతోషించాడు. తన గారాబాల చిన్నకొడుకు — అంతవాడ్ని ఇంతవాడిగా చేసి, చదువు చెప్పించి, ఉద్యోగం యిప్పించి, పెళ్లి చేసి తన బాధ్యత తీర్చుకున్నాడు. వాడు ఇప్పుడొక ప్రయోజకుడై తన పేరు నిలబెడు తున్నందుకు నిజంగా ఆనందమనిపించింది.

రమణయ్యకు ఇద్దరు కొడుకులు, ఒక ఆడపిల్ల. ఇప్పుడందరికి పెళ్లిళ్ళై స్థిరపడ్డారు. వాళ్ళు స్థిరపడ్డనాటికి యింతకాలం నీడనిచ్చిన అతని యిల్లు అశాంతికి నిలయమైంది.

భార్య శాంతమ్మ చనిపోవడంతో అతనికి సొంత ఇంటిలోనే కాలు నిలువడంలేదు. వ్యవసాయం సాగడంకోసమైనా అక్కడ వుండటం తప్పలేదు. నాట్ల సమయం వరకు పొలాలు చూసుకుని, కోతల సమయానికి తిరిగిరావాలని నిశ్చయించుకున్నాడు.

సూర్యమంటే రమణయ్యకు అమితప్రేమ. చిన్నతనంలో సూర్యాన్ని ఒడిలో ఎత్తుకుని బడిలో దించేవాడు. అలాంటి చిన్నకొడుకు ఇప్పుడో చిన్నపాటి ఆఫీసరయ్యాడు.

తండ్రికి ఇష్టమైన పదార్థాల్ని చేయించాడు. ఊళ్ళో చూడతగ్గ ప్రదేశాలు చూపించాడు. ఇంకా ఏం చేయాలి ? ఆలోచించాడు. తన ప్రియమైన నాయనకు చేయాల్సింది యింతమాత్రమేనా... అనిపించింది.

తండ్రికి ఏది యిష్టం అని ఆలోచించాడు. కోడికూర, చుట్టలు అని గుర్తు వచ్చింది. వెంటనే మేలిరకం చుట్టలు తెప్పించాడు. కోడికూర వొండించాడు. అయినా తృప్తి కలుగలేదు. ఆలోచించగా, ఆలోచించగా అప్పుడు గుర్తొచ్చింది. తండ్రికి సాయంత్రాలు కల్లు త్రాగడం ఇష్టమని. సందిగ్ధంలో పడిపోయాడు. తన యింటికి కల్లు యెలా తెప్పించాలి ? ఛ! పరువుపోతుంది. మరి... వెంటనే ఒక ఆలోచన స్ఫురించింది. విస్కీ తెప్పిస్తే !

సాయంకాలం భార్యతో సీసా యిప్పించాడు. తళతళలాడే విస్కీసీసా -- చాలా రోజులైంది రమణయ్య త్రాగక.

రాత్రి భోజనాలకు కలిసి కూర్చున్నప్పుడు రమణయ్య హుషారుగా మాట్లాడాడు. జోకులువేసి నవ్వించాడు. చిన్ని చిన్ని మోటుపదాలు వాడినా హుందాగానే అనిపించింది. తండ్రి సంతోషం చూసి సూర్యం తన్మయుడయ్యాడు.

తెల్లవారి "నిన్న ఏ బ్రాండ్ తెచ్చావురా చాల బావుంది." అన్నాడు రమణయ్య ఆఫీసుకు పోతున్న సూర్యంతో. సూర్యం నవ్వుకున్నాడు.

రోజు సాయంకాలం సూర్యం మిత్రులో, అతని భార్య స్నేహితురాళ్ళో ఎవరో ఒకరు వచ్చేవాళ్ళు. రమణయ్య త్రాగివుండడం సూర్యానికి కాస్త కలుక్కుమనేది. ఐనా అది బయటకు కనిపించనివ్వక పోయేవాడు. మరీ త్రాగినవాడిలా కాకున్నా ఇంటికి వచ్చినవాళ్లతో ఏదో మాట్లాడేవాడు. అది సూర్యం భార్యకు నచ్చేదికాదు. అట్లని బాటిల్ తీసుకు రావడం మానలేకపోయాడు. తీసుకురానప్పుడు మాత్రం రమణయ్య అడగడం మానలేదు.

అలా నెలరోజులు గడిచాయి.

రమణయ్యకు ఏమనిపించిందో ఏమోగాని ఒకనాడు, కొత్తగా పెళ్లైన దంపతుల మధ్య ఎక్కువరోజు లుండటం యిష్టంలేదన్న నెపం పెట్టి అయిష్టంగానే పెద్దవాడు చంద్రం దగ్గరికి ప్రయాణమయ్యాడు.

ఇతర రాష్ట్రం, పైగా చాలదూరం ఐనా సూర్యం వుండిపొమ్మని బలవంతం చేయలేదు.

* * *

తండ్రిని సాదరంగా ఆహ్వానించి, ఎప్పుడూ తనదగ్గరే వుండమన్నాడు. మనుమలు, మనుమ రాళ్ళతో హాయిగా వుంది. ఒంటరితనం నుండి కాస్త ఉపశమనం లభించింది.

"చంద్రం! ఈ పట్టణంలో ఏ బిజినెస్ బాగా నడుస్తుందిరా ?" అని అడిగాడు. "అక్కడ వ్యవసాయం కౌలుకిచ్చి యిక్కడే ఏదో చిన్నపాటి వ్యాపారం చేసుకోవచ్చుగా !" అన్నాడు.

ఏ బిజినెస్ ప్రారంభించాలో దాని బాగోగులు విచారించారు. ఇంకా ఆలోచించి ఏదైనా ప్రారంభించాలని – దానికి తన కొడుకుకూడ చేదోడువాదోడుగా వుంటాడని చెప్పాడు చంద్రం. మామగారు ఎందుకయినా తమ దగ్గరే వుండటం మంచిదని సంతోషించింది చంద్రం భార్య.

సాయంకాలం ఆరు బయట కూర్చున్నప్పుడు "ఏరా! రెండ్రోజులనుండి ప్రాణం తికమకగా వుంది. ఇంత పెద్ద పట్టణంలో ఓ మాంచి బాటిలు దొరకదారా ?" కొడుకును ఎలా అడగాలో తెలియక తికమకపడ్డాడు. బాటిల్ అంటే ఏం బాటిలో వెంటనే అర్థంకాలేదు చంద్రానికి.

"అదేరా విస్కీ బాటిల్ !" పెద్దగా నవ్వుతూ అన్నాడు.

చంద్రం అమాంతం ఆశ్చర్యపోయాడు. తండ్రి

## ప్రశ్నావళి * —కె. రామలక్ష్మి

ఎస్. వి. ఆర్. — విశాఖపట్నం

మీకు సంస్కారం లేదనుకుంటాను. సావిత్రి, అరుంధతి, అనసూయ, సీత మొదలగు పతివ్రతా శిరోమణులు పుట్టిన దేశంలో పుట్టి...

★ చిత్రం. దీన్లో నా బాధ్యత ఏముంది చెప్పండి ? !

జి. ఎస్. ఆర్. — ఆదోని

నేటి విద్యార్థులు చాలా ఉత్సాహంగా కాలేజీల్లో చేరతారు. ఆ తరువాత క్లాసులకు ఉత్సాహంగా పోక కాలం వృధా చేస్తూంటారు.

★ క్లాసుల్లో పాఠాలు అంత ఉత్సాహాన్ని రేకెత్తిస్తున్నాయన్న మాట! మన విద్యావిధానమే అంత — తాము చదువుకున్ననాటి నోట్సులు తుచ తప్పకుండా తిరిగి డిక్టేట్ చేసే లెక్చరర్స్, విద్యార్థులు ఏమాత్రం తెలివితేటలు ప్రదర్శించినా ఉడుక్కొని 'స్నబ్' చేసే ప్రొఫెసర్స్, వ్యక్తిగతంగా ఆలోచించే కుర్రకారుని తొక్కిపెట్టి చదువంటే అసహ్యం పుట్టించేస్తున్నారు — చాలాచోట్ల. అలాంటప్పుడు డిగ్రీ కోసం చదవక తప్పనివాళ్లు కాలేజీల్లో చేరకా తప్పదు. బోర్ క్లాసులు కట్‌చేసి హాయిగా తిరక్కా తప్పదు.

ఎన్. ఎస్. ఆర్. — నెల్లూరు

మా నలభీమపాక శాస్త్రాల తర్వాతనే మీ ఆడవాళ్లు చేసే వంటలు... ఏమంటారు ?

★ ఏమంటాను ? అనవసరంగా ఆడవారికి వంట అంటకట్టి మీ ప్రతిభకు భంగం తెచ్చుకున్నారనాలంతే !

జి. డి పి. ఆర్. — గుంటూరు

అనాదిగా ఆడదానికి జరిగే అన్యాయాల మధ్య మారుతున్న నేటి సమాజంలో స్త్రీ జీవితానికి పరిష్కారం ఏమిటి ?

★ పరిష్కారం లభిస్తుంది — చుట్టూ పరిస్థితులు, సాటి మనుషులైన మగవారు చేయూతనిస్తే. కాని, ఈనాడు స్త్రీలు ఆలోచించినంత విశాల హృదయంతో పురుషులు ఆలోచించడంలేదు. అభ్యుదయ మార్గాన పయనించాలన్న ఆత్రుత స్త్రీకి వున్నంతగా పురుషుల కుండడంలేదు. నా చిన్నప్పుడు 'ఆడదానికి చదువెందుకు ఉద్యోగం చెయ్యాలా వూళ్లేలాలా ?' అనే మాట విన్నాను. బహుశా మీ అమ్మ ఆ మాట వినేవుంటుంది. గమ్మత్తేమిటంటే—యిప్పుడూ అదే మాట యింకా వినబడ్డం! దీన్నిపట్టి చూస్తే — స్త్రీ పురోగమించినంత వేగంగా పురుషులు పురోగమనాన్ని కోరడం లేదనేగా.

పి. వి. ఆర్. — కడప

ప్రళయ కాలములో వీచెడి గాలివంటి మగవారి ప్రశ్నలకు పండుటాకువంటి మీరు జవాబులతో ఎదుర్కొని నిలబడగలరా ? నాకు నమ్మకంలేదు.

★ ప్రళయకాలపు గాలి స్పీడు ఎన్నాళ్లు ? ! అంచేత మరేం భయంలేదు... గట్టిగా ఆరిస్తే త్వరగా అలసిపోతారని తెలుసు నాకు !

పి. పి. — హైదరాబాదు

ఆడదంటే మీ కెందుకంత దురభిమానం ?

★ ప్రతి ఆడదాని గుండెల్లో సన్నని అగ్నిహోత్రం వుంటుంది. అదే, కష్టాల చీకటులు ముసిరినప్పుడు వెల్గునిస్తుందని నా నమ్మకం. అందుకే అభిమానించమంటాను.

జి. వి. ఆర్. — విశాఖపట్నం

ఏంచేసినా ఎక్కడికేనా వెళ్లివచ్చినా కూడా సంతోషంగా వుండడంలేదు కారణం వూహించ కలరా ?

ఏముందీ మీ ఆనందం — మీ పెరటి మొక్క. పక్కింటి తోటలోంచి కొనుక్కోవాలనుకోవడం అపోహ మాత్రమే... నని గ్రహించలేకుండా వున్నారని అర్థం.

ఆడవాళ్లెందుకండీ ప్రతి చిన్నదానికీ నోరు పెట్టుకు పడిపోతారు ?

★ వారి అసహాయ పరిస్థితి వారిచేత అలా చేయిస్తుంది. అష్టదిగ్బంధనం చేసి ఇష్టమొచ్చినట్టు — చెలగాటం ఆడితే — ప్రాణ సంకటంలోపడ్డ ఎలుక కూడా తిరగబడి కరవాలని చూస్తుందే — అలాగే — అనుకోండి — ఆడదాని నోరు పారేసుకునే మనస్తత్వం ! చాలా తక్కువమందికే ఎప్పుడు మౌనం వహించాలో తెలిసే నేర్పు వుంటుంది.

సిహెచ్. ఎస్. ఆర్. — లక్ష్మీపాలెం

మీ 'మూడో మనిషి' చదివాను. స్వర్ణముఖి ముందు ప్రవర్తన దృష్ట్యా ఆలోచిస్తే కొడుకు బాధ్యత వసంతే తీసుకుంటే బాగుండునేమో ?

★ ఎలా? లోకంలో పెంచకల్గినవాళ్లే పిల్లలని కంటే — ఇంతమంది అనాధలు, దిక్కులేనివాళ్లు ఎందుకుంటారు ? తల్లి అన్నాక కుతూహలం తలెత్తకుండానే వుండాలిగాని తనది అయిన బిడ్డని చూసుకోవాలని అనిపించకుండా వుండదు... అదే జరిగింది స్వర్ణముఖి విషయంలోనని నా వూహ.

ఎస్. ఆర్. కె. — రాజపాలెం

మనసిచ్చిన మగువ తన బాధలు మనస్సులోనే— దాచుకుని పనులు చేసుకుంటుంది. అదే మగవాడు ఎన్ని అడ్డంకులు వచ్చినా మరవలేక సతమతమవుతాడు కారణం ?

★ మగవాడికీ ఆడదానికీ అదే తేడా ఆడది వ్యక్తిగతమైన బాధ దిగమింగుకుని బాధ్యతలు నిర్వహించాలని తాపత్రయ పడుతుంది.

ఎమ్. కె. వి. — హైదరాబాదు

మీ రచయిత్రులు ముగింపెందుకు అంత లాగిస్తారు ?

★ ముగింపు ముక్తసరిగా వుండాలని తెలియక? ముగింపు ముక్తసరిగా వుండాలి. ఎందుకో తెలుసా?.. కలిసివుంటే ఆనందంకంటే అది 'విడివడిపోతున్నాం' అనే బాధనే పెంచుతుంది.

---

ఇంటివద్ద అప్పుడప్పుడు కల్లు త్రాగడం తెలుసు. కాని యిలాంటిది త్రాగుతాడని తెలియదు.

"నీకు తెలియదా నాన్నా ! ఇక్కడ మద్యపానాన్ని నిషేధించారు. అమ్మినా, త్రాగినా నేరం !"

రమణయ్యకు కొడుకు జోక్ వేస్తున్నట్లు అనిపించింది. కాని చంద్రం ముఖంలోకి చూసి మళ్లీ ఏమీ అనలేకపోయాడు.

"మరి సూరి దగ్గర..." నసిగాడు రమణయ్య.

"ఇంకా అక్కడ నిషేధించలేదు. త్వరలో నిషేధిస్తారు."

తండ్రి ఆసక్తి చూసి చంద్రానికి భయం వేసింది. త్రాగడంవలన కలిగే కష్టనష్టాల్ని వివరించి చెప్పి, తండ్రితో త్రాగనని మాట తీసుకోడానికి ప్రయత్నించాడు.

## తండ్రి ప్రేమ

అలవాటు పడ్డ ప్రాణం — ససేమిరా ఒప్పుకోలేదు.

భోజనాలప్పుడు, "ఇక్కడ వ్యాపారం బాగా నడుస్తుందో లేదో కొత్త వూరూ, భాషా... మన వూరికే వెళ్లి వ్యవసాయమే చూసుకుంటూ కాలం గడుపుతారా" అన్నాడు.

చంద్రం చాల బాధ పడ్డాడు. ఏమీ మాట్లాడలేకపోయాడు.

రమణయ్య మనసులో మాత్రం సూర్యం చేసిన ఆతిధ్యమే గొప్పగా అనిపించింది. కాని వెంటనే సూర్యం మిత్రులు వచ్చినప్పుడు తాము త్రాగి ఏదో మాట్లాడినప్పుడు వాళ్ళు పడిన బాధ రమణయ్యకు గుర్తు వచ్చింది.

'తన సంతోషం కోసం ఒక రోజు త్రాగడానికి తెప్పిస్తే ప్రతీరోజు తానే తెమ్మన్నాడు. ప్రతిరోజు త్రాగే అలవాటు లేదు. అట్లాంటిది యిప్పుడు... సూర్యమే రోజూ త్రాగితే తాను భరించగలడా ? తనవాళ్ళెవరైనా త్రాగుబోతు ఐతే భరించగలడా ? ఆ అలవాటును మాన్పడానికి ప్రయత్నించనా ? డబ్బు, పరువు నాశనం ! బుద్ధి చెప్పే పెద్దలే తప్పు చేస్తే, తప్పు చేసే కొడుకులకేం చెప్పగలను ? తప్పులు చేయని తనయుల ముందు తలెట్లా ఎత్తగలను ?

తెల్లవారింది.

చంద్రం ఆఫీసుకు పోతున్నప్పుడు రమణయ్య సోఫాలో ఆ మూల కూర్చుని "నేను ఊరికి పోవడం లేదురా, ఇక్కడే ఉండిపోతాను." అన్నాడు.

చంద్రం గర్వంగా నవ్వుకుని తండ్రివైపు చూసాడు. కాని రమణయ్య అది గమనించి చిరుకోపంగా ముఖం ఆ వైపుకు త్రిప్పుకున్నాడు.

# పబ్లిసిటీ

నాగభైరవ ఆంజనేయులు




ప్రముఖ చలనచిత్ర కథానాయిక రంగశ్రీ హాల్లో విరాగ్గా పచార్లు చేస్తోంది. ఆమె ఒళ్ళు భగభగ మండిపోతుంది. మనసు కుత కుత వుడికి పోతోంది. గత పదేళ్ళుగా అటు తమిళ ప్రాంతం లోనూ, ఇటు ఆంధ్రదేశంలోనూ ప్రేక్షకుల మనసుల్ని చూరగొని, వారి ఆదరాభిమానాల్ని మెన్నగా పొంది వెండితెరపై దేదీప్యమానంగా వెలిగిన రంగశ్రీని గురించి గత నెలరోజులుగా ఏ సినిమా పత్రికలోనూ ప్రముఖంగా వ్రాయలేదు. తన తర్వాత పరిశ్రమలో జొరబడినవారిని గురించి ఎంతో పొగుడుతున్నారు. అదే సహించలేకపోతుంది రంగశ్రీ.

అసలే ప్రేక్షకులు గొర్రెలమంద. ఒట్టి పిచ్చిమాలోకం. ఎంతగా అభిమానించే తారయినా కొన్నిరోజులు తెరపై కనబడకపోతే, ఆ తారను గురించి ఏ పత్రికా పొగుడుతూ వ్రాయకపోతే అభిమానులు ఆ తారమీద దురభిమానాన్ని పెంచుకుంటారు. ఆ తారకు 'డిమాండ్' తగ్గిందని అంచనా వేస్తారు. గ్లామర్ లేదని భావిస్తారు. ఆ తార నటించిన సినిమా విడుదలయినా పెద్దగా ఆర్భాటం చేయరు.

రంగశ్రీకి గాభరాగా వుంది. తనకి డిమాండ్ తగ్గిపోతుందేమో! బుకింగులు రావేమో! ఎలాగయినాసరే అన్ని సినిమా పత్రికలూ తన గురించి ప్రముఖంగా వ్రాసేటట్లు చేయాలి.

అంతలో సెక్రటరీ గుమ్మంలో నిలబడి కొద్దిగా ముందుకి వంగి చేతులు జోడించి ''గుడ్‌మాణింగ్ మాడమ్!'' అన్నాడు వినయ విధేయతల్ని స్వరంలోనూ, ముఖంలోనూ రంగరిస్తూ.

రంగశ్రీ పచార్లు ఆపి సోఫాలో కూర్చుంది. సెక్రటరీ అప్పలస్వామి ఆమెకు దగ్గరగా వచ్చి కాస్త దూరంలో నిలబడ్డాడు.

''నీవు నిద్రపోతున్నావా?'' రంగశ్రీ హుంకరించింది. అప్పలస్వామి కళ్ళు నులుముకొని చూశాడు. ఒళ్ళు గిల్లుకున్నాడు.

''లే ... లేదు మాడమ్!''

''మరి పబ్లిసిటీ కోసమని ప్రతినెలా వేలకువేలు తగలేస్తున్నావే ... ఆ విలేఖరులు నిద్రపోతున్నారా?'' గద్దించి అడిగింది రంగశ్రీ.

అప్పలస్వామి తల గోక్కొని నిటారుగా నిలబడి ''లేదు మాడమ్...'' అన్నాడు.

''నా డబ్బులు తింటున్న ఆ కుక్కలు నాగురించి పత్రికల్లో ఎందుకు వ్రాయటంలేదు గత నెల రోజులుగా?''

''పోయిన వారం 'దుమారం' పత్రికలో మీ న్యూస్ వేశారుకదా!'' అప్పలస్వామి నసిగాడు.

''స్టుపిడ్ న్యూస్. ఎనిమిదో పేజీలో ఆరో కాలంలో నాలుగు లైన్లు వ్రాశారు. అదీ వార్తే. నో... మొదటి పేజీలో అన్ని కాలంలు నా గురించి వ్రాయాలి. అదీ న్యూసంటే.''

''మరి... అలా వ్రాయాలంటే ఏదైనా విశేషం జరగాలి.''

''అదే నేను అడుగుతున్నా అప్పలస్వామీ. అందర్నీ ఆకట్టుకునేలా మొదటి పేజీలో మనగురించి రావాలంటే ఏం చేయాలి'' రంగశ్రీ కోపం కొంత కరిగిపోయింది.

''మీ ఇంట్లో దొంగలుపడి నగలు కాజేసినట్లు రిపోర్టిస్తే...'' అప్పలస్వామి నవ్వుతూ చెప్పాడు.

రంగశ్రీ కోపంగా చూసింది. ''ఇదే వార్త మొన్న గంపశ్రీ గురించి వేశారు. అందులో కొత్తేమీ లేదు.''

అప్పలస్వామి మదురు అరచేతో

## సామాన్యుని సణుగుడు

# 'ప్యార్' అనగా ప్రేమ!

వాతావరణం గొప్ప చల్లగా వుంది – యిప్పుడో గడియో వాన పడవచ్చును... ప్రియుడు చేస్తున్న పని వదిలి ప్రియురాలికోసం పరిగెత్తుకు వచ్చాడు. ఆమె చీర తిరగేసి కట్టుకుందో, మరి ఎలా కట్టుకుందో... మాపు కన్పడకుండా కట్టుకుంది... స్నేహం పగ్గమై లాగగా వచ్చింది ఆ యిద్దరూ కల్సుకున్నది వాళ్ళ "బృందావనం" ఒక ఫుట్‌పాత్... ఫుట్‌పాత్ మీద నిలబడ్డ యీ జంటని ఎవ్వరూ గమనించరు... ఎలా గమనిస్తారు? చిరుగుల పంట్లాం – ఎరువు కోటు – చింకి టోపీరాయుడు "హీరో" అని యెవడికి పడుతుంది?

ఆ యిద్దరూ అర్జంటుగా మాట్లాడేసుకున్నారు. స్నేహం అనే విత్తనం ఆ రెండు పేద గుండెల్లోను ప్రేమగా మొలకెత్తుతున్న ఛాయలు, మొహంలో కళ్లలో, వాళ్ళ చిరునవ్వుల్లో తొంగి చూస్తున్నది.

"టీ అబ్బి" హీరోకి ఫ్రెండు... చిన్న డబ్బా, దాని కింద కుంపటి దానికే తగిలించిన కప్పులు. బక్కెట్‌లో నీళ్ళు!

"చాయ్ తాగుతావా?" అడిగాడు హీరో.

గొప్పగా చూసింది హీరోయిన్... ప్రియుడు యిప్పించే టీ యెలా కాదంటుంది...

స్పెషల్ టీ చెప్పటంకోసమా అన్నట్లు హీరో "చాయ్‌వాలా" చెవులు కొరికాడు.

"ఈసారిమాత్రం అప్పు యివ్వను... రొక్కం కొట్టాలి" అన్నాడు చాయ్‌వాలా.

హీరో రాజు వొప్పుకున్నాడు.

ఒహో!... ఆ వాతావరణంలో వేడివేడిగా రెండు కప్పులు అక్కడే ఫుట్‌పాత్ మీద కూర్చుని సేవిస్తుంటే యెంత మజాగా వుంది...

దొంగచూపుల మత్తులో వేడి వేడి "టీ" గమ్మత్తుగా వుంది... ఐపోయింది. ప్రేయసి – హీరోగారి ఆతిథ్యాన్ని అపురూపంగా స్వీకరించింది... టీ త్రాగేసింది...

కాని హీరోగారికి గొంతులో పచ్చివెలక్కాయ పడ్డది... చిల్లరలేదు... అంటే టోకు వుందనా? 'చాయ్‌వాలా' మొహమంతా మీసాలు చేసుకుని చూస్తున్నాడు.

భయపడ్డాడు హీరో,

కాని భంగపడటం యిష్టంలేదు... కాని యెట్లా?

"నీదగ్గర చిల్లర పావలాకాసుందా?"

అమ్మాయిగార్నడిగాడు వందరూపాయల నోట్లు మాత్రం చింకి జేబులనిండా వున్నట్లు కేవలం చిల్లర పావలాకాసు మాత్రం లేనట్లు – అడిగాడు.

దీనమైన దృశ్యమా? యిది కాదు...దీటైన సన్నివేశం అది...

అదృష్టవశాత్తు ఆమె స్నేహితుడి దగ్గరికి పోతూ వుట్టి చేతులతోనా? పోవడం అన్నట్లు చిల్లర "మానేజీ" చేసుకొచ్చింది.

నవ్వుతూ యిచ్చింది... ఆ నవ్వులో–ఏముందో ఆనక చెప్తాను.

హీరో ఆ పావలా కాసు చాయ్‌వాలా కిచ్చేశాడు. మేఘాలు గర్జించాయి... వర్షించాయి ఆ వానలో ఎదలోపల పెరిగే వెచ్చనీ ప్రేమలో "ప్యార్‌హువా" హీరోయిన్ హీరోలు అలాగే తడుస్తూ... "ప్యార్ హువా యిక్ రార్‌హువా..." అంటూ పాడుకుంటూంటే... ఆ ప్రేయసి నవ్విన నవ్వులో ఆ విశాలమైన నోరు యిప్పినప్పుడు పలువరుస మల్లెపూల్లా మెఱిసి – సినిమా కవులంతా తల్లక్రిందులా యిద్దై కూడా రాయలేని రెండర్థాల డైలాగులు కొన్ని వందలు తళుక్కుమన్నాయి – ప్రేమ, జాలి, ఆదరణ, ఆకర్షణ విశ్వాసం యిన్ని భావాలను కామిరా క్లోజప్‌లో పట్టుకుంది.

ఈ సీను ఎక్కడిదో... యీపాటికి అందరూ "గెస్" చేసేవుంటారు. ఈ సన్నివేశం మన ఆధునిక నవలలోను – అప్టుడేట్ బైస్కోపులలోనిది కాదు. రాజకపూర్ తీసిన 'శ్రీ 420' సినిమాలోనిది.

ప్రేమ ఫుట్‌పాత్‌మీద చింకిగుడ్డల వాళ్లమధ్యా పావలాకి రెండు కప్పులు లభించే "చాయ్"లోను ఆవిర్భవిస్తుందా? ని అడగుతున్నారా?

ఆ సన్నివేశ కల్పన చేసిన "సినిమా కారుడు" ఆ సీను చూసిన ఎవ్వరికీ ఆ సందేహం రానంత కళాత్మకంగా తీశాడు. ఏనాటి మాటో అది... ఆ రాజ్‌కపూర్ యివాళ లేడు... "సంగమ్" సినిమాతోనే సున్నితమైన ప్రేమ సన్నివేశాలకతను స్వస్తి చెప్పాడు.

ఇలాంటివి మన కివాళ సినిమాల్లో దొరకవు. ఈ ప్రేమ కథల్లోను దొరకదు.

'మనసనేది' ఒకటుంది దాన్ని 'కామిరా' పట్టుకోవాలంటే – డైరక్టర్‌కి ఎంత తపస్సు కావాలి?

మన కథల్లోనే అయితే! తొలి చూపునుంచీ కూడా ఇలా "గర్భాదానపు" గది 'కళ' కారిపోవడమే తప్ప...

మన సినిమాలైతే సరేసరి... అమ్మమ్మ... మాట్లాడుకుంటే చాలు – హీరో హీరోయిన్‌లు– అన్నీ రెండర్థాలే – యిక పాడుకున్నవో సరేసరి!

హృదయం అనేది ఒక "పడగ్గది అర" ఒక "లాడ్జింగు హౌసు గది" – అదో కార్యం గది మంచం – లాంటిది సుమా? – అంతకన్నా ఆడదానికి మగాడికి మధ్య వుండే హృదయం ఏమిటీ? ప్రేమ ఏమిటీ? – నాన్‌సెన్సు... "దోబదన్" అంటే రెండు శరీరాలు ముఖ్యం – "దో దిల్‌కా జమానా చలా గయా" – అంటే రెండు గుండెకాయ లొక్కటయ్యే రోజులు పోయాయి అన్నట్లుగా తయారైంది దేశవాళీ బైస్కోపు...

హృదయం – ఆరాధన విరహం–త్యాగంలాంటిదంతా సాబ్ సిస్టర్ స్టఫ్ అయిపోయింది...

ఏం చేస్తాం... ఎవరికోసం చూస్తాం...

గట్టిగా ఒకర్ని ఒకరు నలిపేసుకుంటూన్న సన్నివేశం చూపెడుతూనే, గుడ్డివాళ్లకోసమా? అన్నట్లు – మన సినిమా స్రష్టలు – "నలిపేయి... చంపేయి... నీ కౌగిలిలో నన్ను యిది చేసై అది చేసై" అంటూ అరవై వాద్యాలతో బ్యాక్‌గ్రౌండులో గోలకూడా చేస్తున్నారు. ఆరేళ్ల కూనకి పై సన్నివేశంలోని ఒక స్టిల్‌ని పత్రికలో పడ్డదాన్ని చూపెట్టి అడగండి – "యిదేమిటిబాబూ" అని టక్కున వాడంటాడు. 'ఇదే తెలీదా? వాళ్లిద్దరూ ప్రేమించుకుంటున్నారు' అని. అయ్యో అదీ ప్రేమ.

— నీరాజ

## పబ్లిసిటీ

రుద్దుకున్నాడు. మెరుపులాటి ఆలోచన మెదిలింది.

"మేడమ్! ఈవిధంగా చేస్తే మీ పేరు ప్రేక్షకలోకంలో మారుమ్రోగుతుంది."

"ఏవిధంగా?" అన్నట్లు చూసింది రంగశ్రీ.

"మీరు మీ భర్తకు విడాకులిచ్చి మరో ప్రముఖ హీరోని పెళ్ళాడబోతున్నారని విలేఖరులకు చెబితే..."

"ఏడ్చినట్లే వుంది నీ బోడి ఐడియా! పోయిన నెల్లో విజయవాడలో జరిగిన పత్రికా గోష్ఠిలో 'నా శ్రీవారంటే నాకెంతో ప్రేమని, నాపతియే నాకు ప్రత్యక్ష దైవమని చెప్పాను.'

'పోనీ మేడమ్! మీ అబ్బాయిగారిని ఎవరో దొంగలు ఎత్తుకపోయారని చెబితే..."

"దాంతో పోలీస్ ఎంక్వయిరీ. అబ్బాయి ఖచ్చితమైన వయసు చెప్పక తప్పదు. అబ్బాయి అసలు వయసు తెలిస్తే నా అసలు వయసు బయట పడుతుంది. ఉన్న గ్లామర్‌కాస్తా ఊడ్చుకపోతుంది."

అప్పలస్వామి ఆలోచించి "మేడమ్! రేపు రోడ్డుమీద కారుకు ఏక్సిడెంట్ జరిగేలాచేద్దాం."

"ఇదేమన్నా సినిమా షూటింగా కారు ఏక్సిడెంట్ జరగటానికి! ట్రిక్ ఫొటోగ్రఫీ లేకుండా, డూప్ లేకుండా ఏక్సిడెంట్ జరిగితే నా కాలో చెయ్యో విరుగుతుంది. రాస్కెల్! యిలాంటి వెధవ ఆలోచనలు మాను. వారంరోజుల్లో ప్రముఖంగా పత్రికలన్నీ ప్రచురించే విధానం గురించి ఆలోచించు. లేదా నిన్ను డిస్మిస్ చేస్తాను." రంగశ్రీ అప్పలస్వామి మీద మండిపడింది.

అప్పలస్వామి తన అద్దె యింటికి వెళ్ళాడు. ఆలోచించాడు. మంగుళూరు బీడిలు కాల్చి కాల్చి మరీ ఆలోచించాడు. నాలుగోరోజు సాయంత్రానికి అప్పలస్వామికి బ్రహ్మాండమైన ఆలోచన తట్టింది. వెంటనే పబ్లిక్ ఫోన్ దగ్గరికి వెళ్ళి ఏదో నెంబర్ తిప్పి రహస్యం చెప్పినట్లు చెప్పాడు. యింటికి చేరి కడుపునిండా అన్నం తిని నిద్రపోయాడు.

అప్పలస్వామి చేసిన ఆ ఫోను ప్రభావంవల్ల మూడోరోజుకి సినిమా పత్రికలేకాదు... ప్రముఖ దినపత్రిక లన్నీ కథానాయిక రంగశ్రీని గురించి మొట్టమొదటి పేజీలో ప్రముఖంగా వ్రాశాయి.

ప్రచురితమైన ఆ వార్త సారాంశం:

"గత రాత్రి ఆదాయపుపన్ను శాఖవారు ప్రముఖ కథానాయిక రంగశ్రీ ఇంటిపై మెరుపుదాడి జరిపారు. లెక్కలలో చూపించని నల్లధనం, బంగారపు నగలు, డాలర్లు మరెన్నో విదేశీ వస్తువులు బయటపడ్డాయి. వాటి విలువ ముప్పయి లక్షలకు పైనే వుంటుందని అంచనా. రంగశ్రీని అరెస్టు చేశారు."



## 4-2-1977 శుక్రవారం మొదలు 10-2-1977 గురువారం వరకు

**మేషం :—** వృత్తివ్యాపారాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి. మిత్రుల సహాయం లభిస్తుంది. రాజకీయ వ్యవహారాల్లో శ్రమ కలుగు తుంది. ప్రయాణాలు వాయిదా పడతాయి. నూతన వ్యవహారాలు లాభించగలవు. స్త్రీలకు —ఆరోగ్యం బాగుంటుంది. ఆడంబరంకోసం వ్యయం జరుగుతుంది.

**వృషభం: —** మీ కార్యక్రమాలు హడావుడిగా ఉంటాయి. పోటీవారిలో గౌరవం లభిస్తుంది. సాహసిక వ్యవహారాలు లాభిస్తాయి. విద్యా వైజ్ఞానికరంగాల్లో మీ కృషిరాణిస్తుంది. ఇతరుల నిర్లిప్తత్వం ప్రశంసకు గురి కాగలరు. స్త్రీలకు—దైవ కార్యాలు నెరవేరతాయి. వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు.

**మిథునం: —** రాజకీయ వ్యవహారాలు బాగుంటాయి. వృత్తిలో పోటీవారి పోటీ తగ్గుతుంది. స్థిరాస్తి వ్యవహారాలు బాగుంటాయి. ప్రయాణాలు వాయిదా పడతాయి. ముమ్ముందు లాభించగల వ్యవహారాల్లో అభివృద్ధిని సాధిస్తారు. స్త్రీలకు—ఆరోగ్యం బాగుంటుంది. సంతానానికి సౌఖ్య సంతోషాలు లభిస్తాయి.

**కర్కాటకం :—** మీ శ్రమకు తగిన ఫలితం లభిస్తుంది. రావలసిన డబ్బు అందుతుంది. వ్యాపార విస్తరణ ప్రయత్నాలు బాగుంటాయి. సజ్జన సాంగత్యం లభిస్తుంది. వారం ఆఖరులో మీ కార్యక్రమాలు హడావుడిగా ఉంటాయి. స్త్రీలకు — కుటుంబ వ్యవహారాలు బాగుంటాయి. పుణ్య కార్యాలు చేస్తారు.

**సింహం :—** వ్యాపారంలో ఆదాయం బాగుంటుంది. మీ ప్రయత్నాలు ఫలిస్తాయి. ప్రయోజనం గల పరిచయాలు ఏర్పడతాయి. విద్యా వైజ్ఞానిక రంగాల్లో ఖ్యాతి లభిస్తుంది. సాహసిక వ్యవహారాలు లాభిస్తాయి. స్త్రీలకు — ఆరోగ్యం బాగుంటుంది. సంతోషకరమైన వార్తలను వింటారు.

**కన్య: —** ప్రయాసకు గురి కాగలరు. సాహసిక వ్యవహారాల్లో నష్టం రాగలదు. వారం మధ్యలో మీ కార్యక్రమాలు బాగుంటాయి. వృత్తిలో నూతనావకాశాలు లభిస్తాయి. నూతన వ్యవహారాలు లాభిస్తాయి. స్త్రీలకు —కుటుంబ వ్యవహారాలు బాగుంటాయి. మీ తాలూకు వస్తువులు పోవచ్చును.

**తుల :—** మీ ప్రయత్నాలు ఫలిస్తాయి. మిత్రుల సహాయం లభిస్తుంది. వారం మధ్యలో ప్రయాణాల్లో శ్రమకలుగు తుంది. ఉద్యోగంలో చికాకులుయేర్పడతాయి. వారం ఆఖరులో అనుకూలమైన మార్పులు వస్తాయి. స్త్రీలకు — ఆరోగ్యం బాగుండదు. విలాస వస్తువులు కొంటారు.

**వృశ్చికం :—** అన్ని వ్యవహారాల్లోనూ గౌరవం బాగుంటుంది. పుణ్యకార్యాలు చేస్తారు. వ్యాపారంలో ఆదాయం పెరుగు తుంది. విద్యా వైజ్ఞానికరంగాల్లో మీ కృషి రాణిస్తుంది. వారం ఆఖరులో ప్రయోజనంలేని శ్రమకలుగు తుంది. స్త్రీలకు —కుటుంబ వ్యవహారాల్లో కార్యభారం పెరుగు తుంది. బంధు మిత్రులను కల్సుకొంటారు.

**ధనుస్సు :—** రావలసినడబ్బు అందు తుంది. మిత్రులకు సహాయం చేస్తారు. స్థిరాస్తి వ్యవహారాలు బాగుంటాయి. వృత్తిలో ముఖ్యమైన వ్యక్తులను కల్సుకొంటారు. సాహసిక వ్యవహారాలు లాభిస్తాయి. స్త్రీలకు —ఆరోగ్యం బాగుంటుంది. వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు.

### రాలిన ముత్యాలు

**....శ్రీ సోమసుందర్....**

యమ వేతల పాలనకు పాల్పడి
ఘూర్ణిల్లుతున్న విగత భర్తృక సావిత్రి
ఎన్నికల ఎంగిలాకు తేరుకొనే
అరిపేదల ధరిత్రి
అందుకే ఆకాశం తెరుస్తోం దంగార
నేత్రం!

**మకరం :—** లాభంరావలసిన వ్యవహారాల్లోనే నష్టం రావచ్చును. ప్రయాణాల్లో శ్రమకలుగు తుంది. వారం మధ్యలో అనుకూలమైన మార్పులు వస్తాయి. వ్యాపారంలో ఆదాయం బాగుంటుంది. ఉద్యోగంలో గౌరవం లభిస్తుంది. స్త్రీలకు — కుటుంబ వ్యవహారాల్లో కార్యభారం పెరుగు తుంది. బంధువులకు సహాయం చేస్తారు.

**కుంభం :—** భాగస్వాములతో కలిసి చేసే వ్యాపారాలు బాగుంటాయి. మీ ఆలోచనలు ఫలిస్తాయి. వారం మధ్యలో ఆందోళన కలుగు తుంది. వృత్తిలో చికాకులు యేర్పడతాయి. వారం ఆఖరులో మీ కార్యక్రమాలు బాగుంటాయి. స్త్రీలకు — ఆరోగ్యం బాగుండదు. పోటీవారిలో గౌరవం లభిస్తుంది.

**మీనం :—** పోటీవారితో పనికి వచ్చే ఒప్పులు తగవు. ఆడంబరంకోసం వ్యయం చేస్తారు. రావలసినడబ్బు అందు తుంది. ఉద్యోగంలో గౌరవం బాగుంటుంది. వారం ఆఖరులో చేతికి వచ్చిన అవకాశాలు కూడా జారిపోవచ్చును. స్త్రీలకు — కుటుంబ వ్యవహారాలు బాగుంటాయి. ప్రయాణాలు వాయిదా పడతాయి.

— మహేష్

కున్నది. 'పెదరెడ్డి' గారి శక్తిసామర్థ్యాలు అతనికి సుపరిచితాలే. అసహాయత, దైన్యత అతనిని వివశుడిని చేసి సంధి ప్రసలాపములవంటి మాటలనతని చేత పలికింప జేస్తున్నవి.

అతడు తలపాగాను విసురుగా చుట్టుకుని, "ఏలికలు ఏరికుప్ప పెట్టేస్తా. నాయింటి మీద చెయ్యేసేదానికొచ్చినోడి ఏలికలేరి కుప్ప పెట్టేస్తా." అన్నాడు.

కలాపి చల్లటంతో ముంగిట తడిగా ఉన్నది. తడిగాఉన్న నేలమీద నాగ ముగ్గు వేసింది. ఆమె ఒక ముగ్గునువేసి ముగించి, రెండవ ముగ్గను ప్రారంభించి జానెడు

## ఇన్‌క్రెడిబుల్ గాడెస్

(18వ పేజీ తరువాయి)

గీతను గీచి నడుమెత్తి నిలుచుంది. కొంతసేపు ఆ జానెడుగీతను చూసి, కాలి బొటనవేలితో దానిని చెరిపివేసి, ఇంటిలోపలకు వెళ్లి పోయింది.

మేతకై వెళ్లి ఉండిన కబోది పిట్టలు గుంపులు గుంపులుగా తిరిగొచ్చి, ఆటనున్న మద్దిమాను కొమ్మలమీద వాలుతున్నవి. వేల కొలదిగా ఉన్న పిట్టలకు ఆశ్రయమిస్తున్న ఆ మహావృక్షం ఉన్నతంగా, ఠీవిగా నిలుచువిఉంది.

రామచంద్రుడు, భార్య ఇంటిలోపలకు పోయారు, గుమ్మం వైపు చూస్తూ, "ఈ లంజ, తెంచబోయే ముండ మాదిరి తెల్లారి లేచి పీడమొకంతో కూర్చోనుంది. ఈపూటమాత్రమేమి కలిగ్గం మునిగిపోతా ఉందా? సూర్యుడు పటమర లట్టున పుట్టబోతా ఉండడా? దొన్నేనిలో పొయే ముండ" అన్నాడు.

ముఖమూ, కాళ్ళు చేతులు కడుగుకొన్న కిష్టుడు పెరట్లోనుంచి తపతపమని పరుగిడుతూ ఇంటిలోపలికి వెళ్లిపోయాడు.

(ఇంకావుంది)

# దేవుడు పంపిన మనిషి

## వాణిశ్రీ






గుంటూరు నుంచి రాత్రి ఏడింటికి బయల్దేరిన హైదరాబాద్ బస్సు సత్తెనపల్లి వచ్చేసరికి ఎనిమిదయింది.

"భోజనాలు చేసేవారుంటే చెయ్యండి సార్." అని దిగిపోయారు కండక్టర్, డ్రైవరూను.

చాలా మంది దిగిపోయారు పరమశివుడు గూడా దిగి హోటల్లోకి వెళ్ళి భోజనం చేసి మిఠాయి కిళ్ళీ నములూ, బస్సెక్కాడు తను కూర్చొని లేచిన స్థానంలో ఒక ముసలాయన కూర్చుని వున్నాడు.

పరమ శివుడికి కిటికీ పక్కన కూర్చోవడం చిన్నప్పటి నుంచీ సరదా గుంటూర్లో ఎంతో కష్టపడి ఆ సీటు సంపాదించాడు.

"ఆ సీటు నాదండీ. గుంటూరు నుంచి వస్తున్నాను." అన్నాడు పరమశివుడు.

"అలాగా. కూర్చో నాయనా." అంటూ జరిగికూర్చున్నాడు ముసలాయన.

'హమ్మయ్య' అని నిట్టూర్చి కూర్చున్నాడు పరమ శివుడు.

"ఎక్కడికి నాయనా ప్రయాణం?" అని ప్రశ్నించాడు ముసలాయన.

'మొదలైందిరా నాయనా బోర్. ఎక్కడికి? ఎందుకు పెళ్ళయిందా? మీపుట్టుపూర్వోత్తరాలేమిటి?...అంటూ చంపుతారు ఈ ముసలి వాళ్ళతో వచ్చిన తంటా ఇదే. లోకంలో వివరాలన్నీ తమకే కావాలి అని విసుక్కుని పైకి మాత్రం "హైదరాబాద్ వెళ్తున్నాను." అన్నాడు మర్యాదగా.

"మాడు నాయనా. నువ్వు చిన్నవాడివి అనుభవం తక్కువ. నీమంచికే చెపుతున్నాను. బస్సుదిగి వెళ్ళేటప్పుడు నీసామాను ఎవరికైనా అప్పగించి వెళ్ళాలి గాని, ఇలా వదిలి వెళ్ళ గూడదు" అన్నాడాయన.

పరమశివుడు నవ్వి "ఆ చేతి సంచిలో ఏమున్నాయండీ. నాబట్టలే గదా?" అన్నాడు.

"బట్టలకు మాత్రం విలువ లేదూ? ఒక జత బట్టలు పోతే కనీసం నూటయాభై రూపాయలు పోయినట్లేనా?"

"అవునవును.." అని ఒప్పుకున్నాడు పరమశివుడు.

"నేను దేవుడు పంపినట్లే వచ్చి కూర్చున్నాను కాబట్టి సరిపోయింది. లేకపోతే నీ సంచీని ఏదొంగో ఎత్తుకు పోయేవాడేమో?" అన్నాడాయన.

పరమ శివుడికి వళ్ళు మండింది కాని పైకి ఏమీ అనలేదు. ఆయన వంక పరీక్షగా చూస్తూ వుండి పోయాడు.

ఆ ముసలాయన ఎర్రగా వున్నాడు. వంటి మీద చొక్కా లేదు. శరీరం ముడతలు పడి వుంది. చేతికి, మొఖం మీద విభూది అడ్డ నామాలున్నాయి. మొఖం గాంభీర్యంగా అనుభవాలలో జీవితం పండినట్లుగా వుంది. బస్సు బయల్దేరాక ఆయన దొంగతనాలకు సంబంధించిన కథలు చెప్పడం మొదలు పెట్టాడు. అవిమాళవ రాజ్యంలోనో, పల్లవుల కాలంలోనో జరిగినవి. అప్పటి దొంగలు ఎంత వాక చక్యంతో, బుద్ధిబలంతో దొంగతనాలు చేసేవారో వివరించాడు.

పరమశివుడు విసుగ్గా వూకొడుతున్నాడు. దారి పొడుగునా ఇలా చంపుతాడు కాబోలు ఎక్కడి వరకూ వస్తాడో కనుక్కుందామని "తమరు ఎక్కడి వరకూ?" అన్నాడు.

ఆయన నవ్వి "పిడుగు రాళ్ళవరకే." అన్నాడు.

బస్సు పిడుగు రాళ్ళపొలిమేరల్లోకి వచ్చేసరికి మూడు కథలు పూర్తయ్యాయి. బస్సు ఆగింది.

"బాబు వెళ్తున్నా. నీసంచీ ఒక్కసారి తీసి అన్నీ వున్నాయో లేదో చూసుకో. ఎందుకంటే ఇప్పటి వరకూ నీ ప్రక్కన కూర్చున్నాను. పైగా నువ్వులేని సమయంలో గూడాను." అన్నాడయన లేస్తూ.



## రిపబ్లిక్ దినోత్సవ సందర్భంగా

# నవభారత్ వారి నవలా పెరేడ్!

## పుస్తకప్రియులను 100% రంజింపజేసే నూతన తరహా నవలల విడుదల!!

### "మంచిని పెంచు — చెడుని నిర్మూలించు" మాదిరెడ్డి సులోచన నవల ధ్యేయం!

నేటి జీవన విధానంలో—మంచి చెడుల నిత్య సంఘర్షణనీ, సుఖమయ జీవితానికి మార్గాన్వేషణనీ సమర్థవంతంగా వివరించిన మీ అభిమాన రచయిత్రి మాదిరెడ్డి సులోచన నవలా సీరియల్స్ వెలువడ్డాయి.

| | | |
|---|---|---|
| ఋతుచక్రం — [మహిళ] | — | 7—50 |
| వారసులు — [ఆంధ్రజ్యోతి] | — | 7—50 |
| వీడని నీడ— [స్వాతి] | — | 6—00 |
| భాగ్యలక్ష్మి | — | 6—00 |
| గెలుపు నాదే ! | — | 6—00 |

మరియూ

"ఈ తరం మనిషి" సినిమా కథ మాతృక

| | | |
|---|---|---|
| మిస్టర్ సంపత్ ఎం. ఏ. [జ్యోతి] | — | 10—00 |

### మన నవలాస్థాయి పెరగలేదా?

రమ్యంగా చెప్పుకున్న కుటుంబగాథలూ, మనోహరంగా అల్లిన ప్రేమకథలనూ మించి తెలుగు నవల ఇంకొక మెట్టు పైకి ఎదగాలని అభిలషిస్తున్న పాఠకులకు శుభవార్త!

కథా వస్తువులో నూతనత్వం, చెప్పిన తీరులో ఒక హెూదా, చదివినవారిలో ఆలోచనలకు ప్రేరణా, ప్రత్యేకతలుగాగల చిఫుకుల పురుషోత్తం సీరియల్స్‌ను నవలలుగా మీ అభిమాన నవభారత్ సంస్థ సగర్వంగా సమర్పిస్తోంది.

| | | |
|---|---|---|
| ఏది పాపం ? | — | 7—50 |
| ప్రేమతరంగాలలో జీవన నౌకలు | — | 6—00 |
| తీరని మమతలు | — | 7—50 |
| శుక్రమహర్దశ | — | 6—00 |

## ఇప్పుడు వీస్తున్న నవతరం నవలా ప్రభంజనం!

అటు చిన్నపిల్లల పత్రికల్లోనూ, ఇటు దినవార పక్ష మాసపత్రికల్లోనూ పుంఖాను పుంఖంగా రచనలుజేస్తూ — ఆ రచనల్లో గొప్ప థ్రిల్లూ సస్పెన్సూ బిగించి యువతరం పాఠకులను ఆకట్టుకుంటున్న మల్లాది వెంకటకృష్ణమూర్తి రచనలను మీ నవభారత్ ప్రచురణ సంస్థ మీ అభిమానాన్ని పొందగలవని గ్యారంటీ ఇస్తూ సమర్పిస్తోంది.

| | | | | | |
|---|---|---|---|---|---|
| మేఘమాల | — | 7—50 | ది గ్రాడ్యుయేట్ & Mr. సంపత్ | — | 6—00 |
| మూడు రాత్రులు | — | 6—00 | రేపటి కొడుకు | — | 6—00 |

★ గ్రంథాలయములకు పుస్తకముల ఎన్నిక సందర్భంలో పాఠకులను అమితంగా ఆకర్షిస్తున్న నవభారత్ కేటలాగుకొరకు వ్రాయండి!

★ పై పుస్తకములకు మీ అందుబాటులోని బుక్‌స్టాల్స్‌లో ముందు అడగండి.

★ అడ్వాన్స్ (M.O. ద్వారా) పంపిన V.P.P.లో కోరిన బుక్స్ పంపగలం.

### 1976 సం. లో పాఠకులను ఉర్రూతలూగించిన నవలా సీరియల్స్! ఇవే! ఇవే!! ఇవే!!!

| | | |
|---|---|---|
| జీవితం ఏమిటి — కకుభ | — | 12—50 |
| జ్వాల — ,, | — | 6—00 |
| బంగారురోజులు — కవనశర్మ | — | 6—00 |
| తియ్యనిబాధ — ,, | — | 6—00 |
| గాజుపల్లకి — పి. యస్. నారాయణ | — | 6—00 |
| కీరవాణి — ,, | — | 5—00 |
| శ్రావణసంధ్య—తాళ్ళూరి నాగేశ్వరరావు | — | 6—00 |
| గడ్డిపోచలు — కొలిపాక రమామణి | — | 6—00 |
| హాలాహలంలో అమృతం — ,, | — | 5—00 |
| మజిలీ — గోవిందరాజు సీతాదేవి | — | 6—00 |
| జలతరంగిణి — పురాణం సీత | — | 6—00 |
| ప్రేమకు ఫుల్‌స్టాప్ ఉందా?—ఎం. రంగసాయి | — | 6—00 |
| రాణీ చిన్నాదేవి — నవగీనంద | — | 7—50 |
| వెన్నెల — కవిత | — | 5—00 |
| ఎదురుతిరిగినగాలి — చందు సోంబాబు | — | 5—00 |
| రాతిపువ్వు — సి. యస్. రావు | — | 5—00 |
| జీవనసర్వస్వం — మల్లాది సూరిబాబు | — | 5—00 |
| లీలామనోహరం — ,, | — | 5—00 |
| అతకనిమనసులు — జె. సుబ్బలక్ష్మి | — | 5—00 |
| కాంతా కనకాలు — పురాణం సూర్యప్రకాశరావు | — | 5—00 |
| మృదుల — జయశ్రీ ఉండవల్లి | — | 5—00 |
| పుత్తి — ఆలేటి నాగమణి | — | 5—00 |
| మంచుపల్లకి — వంశీ | — | 5—00 |
| వెన్నెలమెట్లు — వై. రామలక్ష్మి | — | 6—00 |
| కొత్తచిగురు — వి. రాజారామమోహనరావు | — | 5—00 |
| మర్రినీడ — పి. సత్యవతి | — | 5—00 |

మీ సెక్స్ సమస్యల భయాందోళనలను పోగొట్టే డా. సమరం రచన: సెక్స్ - సైన్స్
మొదటి భాగం 7-50 — రెండవభాగం 7-50

## నవభారత్ బుక్ హౌస్

ఏలూరు రోడ్డు • విజయవాడ-2

SAVITA

# దేవుడు పంపిన మనిషి

పరమ శివుడు పక్కన నవ్వి "భలే వారండీ మీరు." అన్నాడు ఆయన అమాయకత్వానికి జాలి వేసింది. పాపం పాత కాలపు మనిషి అనుకున్నాడు లోపల.

ముసలాయన బస్సు దిగిపోయాడు.

బస్సు కదిలి వాయు వేగంతో పరుగు తీసింది.

నారాయణగూడాలో అక్కగారింటికి చేరేటప్పటికి నాలుగు దాటింది.

తెల్లవారితే పరమశివుడి మేనల్లుడికి అన్నప్రాసన.

"అక్కా సంచిలో వెండిగిన్నెవుంది. మీ అబ్బాయికి నాన్న కొనిచ్చాడు." అన్నాడు పడుకుంటూ.

సంచి వెతికింది ఆమె.

"వేళాకోళానికి ఇప్పుడేనా సమయం, కాసేపు నిదపో." అంది విసుగ్గా.

"వేళాకోళం ఏమిటక్కా?" అన్నాడు పరమశివుడు నిర్ఘాంతపోతూ.

"మరేమిటా? వెండిగిన్నె ఎక్కడుంది?"

"సంచిలో లేదూ?"

"లేదు."

పరమశివుడి గుండె ఆగిపోయినట్లయింది సత్తైన పళ్ళెంలో తప్ప తను ఎక్కడా దిగలేదు. ఏమైందబ్బా? అనుకున్నాడు. అతని కళ్ళకి ఆ ముసలాయన ఆకారం లీలగా కన్పించింది ఎంత నమ్మక ద్రోహం అనుకున్నాడు,

జరిగిందంతా విని ఆమె విరగబడి నవ్వింది.

"పోతే పోయిందిలే అక్కా! బావకి మాత్రం చెప్పకు. పరువుతీస్తాడు. రేపు మరొకటి కొనుక్కొని వస్తాలే." అన్నాడు పరమశివుడు దిగులుగా.

### గ్రంథస్వీకారం : గమనిక

స్థలాభావంచేత గ్రంథ స్వీకారం మాత్రమే ఆంధ్ర సచిత్ర వారపత్రికలో అప్పుడప్పుడు వేయుగలుగుతున్నాము. పుస్తకాల శీర్షిక క్రింద సుదీర్ఘమైన సమీక్షలు సాధ్యం కావు. గ్రంథస్వీకారం శీర్షికకి పంపేవారు రెండు ప్రతులు పంపవలసి వుంటుంది. దీనికి సంబంధించి ఉత్తర ప్రత్యుత్తరాలు కూడా సాధ్యంకానిపని అని మనవి. —సం.

# హైదరాబాద్ నోట్‌బుక్

తిరుమల రామచంద్ర

## రంగోలీ పోటీ

వైస్‌మెన్ క్లబ్బు ఆధ్వర్యాన జరుగుతున్న సంక్రాంతి ఉత్సవాల సందర్భంగా వై. ఎం. సి ఎ హాలులో జనవరి 9, 10 తేదీలలో జరిగిన రంగోలీ [ముగ్గుల] పోటీలలో పెద్దల విభాగంలో శ్రీమతి సుందరీ కృష్ణారావు ప్రథమ బహుమతి, శ్రీమతి వేమరాజు లీలాకుమారి ద్వితీయ బహుమతి సంపాదించారు. పిల్లల విభాగంలో కుమారి వేమరాజు లక్ష్మి [12] ప్రథమ బహుమతి, కుమారి వి. కరుణ [11] ద్వితీయ బహుమతి పొందారు. శ్రీ కృష్ణారావు కుమార్తెలు ఉమ [9], పద్మజా హేమమాలిని [7] నృత్యాలు, గొప్ప పాటలతో ప్రేక్షకులను ఆనందింపజేశారు కుమారి పద్మజా హేమమాలిని నిరుడు వై. ఎం. సి.ఎ.లో జరిగిన అఖిలభారత నాట్య సంగీత స్పర్ధలో బహుమతి పొందింది. వైస్‌మెన్ క్లబ్బు అధ్యక్షుడు, సహృదయుడు, కవి, పరిపాలన దక్షుడు శ్రీ వి. నారాయణరావు [ఐ. ఎ. ఎస్.] ఈ సందర్భంలో ప్రసంగిస్తూ తమ సంఘం బాల బాలికలలోని సహజశక్తులను ఉద్దీపింప చేయడానికి విశేషశ్రద్ధ తీసుకుంటున్నదన్నారు. తమ అధ్యక్షతలో వున్న నవ్యనాటక సమితి త్వరలో ఎప్పటిలాగే నాట్య సంగీతాలలో అఖిలభారత స్పర్ధ ఏర్పాటు చేస్తున్నామన్నారు. నిరంతరం అటు ప్రభుత్వ పదవిలో ప్రజాసేవలోను, ఇటు లలిత కళాసేవలోను వ్యగ్రులుగావున్న శ్రీ నారాయణరావును చూస్తున్నప్పుడు ఇలాంటి కార్యదీక్షాపరులు మనకు ఉన్నారు, మనరాష్ట్రం ముందుకు పోక తప్పదు అనే విశ్వాసం మనాను తొడుగుతూ వుంటుంది.

## బిచ్చుక వృత్తిపై నిషేధం

రాష్ట్ర గవర్నర్ రాష్ట్రంలో భిక్షుక వృత్తిని నిషేధిస్తూ జనవరి 3 వ తేదీన ఒక ఆర్డినెన్సు జారీ చేశారు. భిక్షుకులను నిర్బంధంలో వుంచడం, వారికి వృత్తి శిక్షణ ఇవ్వడం, ఉద్యోగాలు కల్పించడం మొదలయిన వాటికి కూడ ఈ ఆర్డినెన్సు అధికారమిస్తుంది. బిచ్చం ఎత్తించే వారు, ఈ నిబంధనలను ఉల్లంఘించే భిక్షుకులు శిక్షార్హులవుతారు. ఈ ఆర్డినెన్సుతో ఇదివరకు అమలులో వున్న భిక్షుక వృత్తికి సంబంధించిన చట్టాలన్నీ రద్దవుతాయి.

## శ్రీ విజయరాఘవరావుకు గాన కళాప్రపూర్ణ బిరుదు

"స్వాతంత్ర్యం నాకు ఒక రాగం వంటిది" అన్నారు జనవరి 6 వ నుంచి నాలుగురోజుల పాటు రవీంద్ర భారతిలో జరిగిన అఖిలభారత హిందూస్తానీ సంగీతోత్సవాలకు అధ్యక్షత వహించిన శ్రీ ఏల్చూరి విజయ రాఘవరావు. 'కాల మానము లోక గతులను మార్చునట, కాలమానమే మార్చి కలిపినారు' అని ఒకప్పుడు ఆయన కవిత చెప్పారు. నిజం దేశ స్వాతంత్ర్యాన్ని రాను ఆరాధించిన రాగంగా భావించేవాడు తానే అన్నట్టు హిందూస్తానీ సంగీత ప్రపంచంలో గొప్ప మార్పులు చేయకపోతాడా? చేశాడు. నరసారావుపేటలో జన్మించి, కాకినాడలో ఉన్నత విద్యాభ్యాసంచేసి, ఆంధ్ర విశ్వ విద్యాలయంలో బి. ఎ. ఆనర్సు తరగతిలోచేరి, సంగీత నృత్యదేవత పిలుపునై చదువు వదలి కళారాధనకు పూనుకున్నారు. శ్రీ పండ నల్లూర్ చొక్కలింగం పిళ్లైవద్ద భరత నాట్యశిక్షణ పొందారు. పండిట్ రవి శంకర్ ఆయనను గొప్ప వేణువాదన నిపుణునిగా తీర్చి దిద్దారు. దేశ విదేశాలలో వ్యా



జనవరి 7న న్యూఢిల్లీలో జరిగిన ఆలిండియా ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ మెడికల్ సైన్సెస్ ప్రత్యేక స్నాతకోత్సవంలో డాక్టర్ జోనాస్‌సాక్‌కి [కుడివైపు ఉన్నవారు] ఇన్‌స్టిట్యూట్ గౌరవ ఫెలోషిప్‌ని ప్రదానం చేశారు. ఈ సభకి కేంద్ర ఆరోగ్య, కుటుంబ నియంత్రణ మంత్రి డాక్టర్ కరణ్‌సింగ్ అధ్యక్షత వహించారు.






## ప్రకృతి పాఠం

చిన్నప్పుడు కాళ్ళకూరివారి చింతామణి నాటకం చూచినప్పుడూ, దాన్ని చదివేటప్పుడూ మనస్సుకు పట్టిన పద్యాలలో ఒక సీసపద్యం జ్ఞప్తికి వస్తూ వుంటుంది. అందులో బ్రహ్మను తిడుతూ

'ప్రీతిమించెడు గులాబీ చెట్టునకు వాడి మించెడి ముండ్లు సృజించినావు'

అని కూడా ఉన్నది కమ్మని వాసనతో ఎంతో అందంగా ఉంటుంది. దాన్ని ఆప్యాయంతో కోసుకొందామంటే ముళ్ళు గుచ్చుకుంటాయి. ఇలా ముళ్ళు నిర్మించడం తెలివితక్కువ కాదా?

సామాన్యదృష్టితో చూస్తే యిది తెలివి తక్కువ అనే అనిపించుకుంటుంది. కాని బ్రహ్మ అంత తెలివితక్కువవాడేమీ కాడు. దానిమూలంగా చక్కని పాఠాన్ని మనకి బోధిస్తున్నాడు. అది ప్రకృతి నేర్పేపాఠం. వాచకపుస్తకంలోని పాఠంకంటె చాలా విలువైనది. అదేమిటి? సుఖం అనేది వుంటే దాని వెంట కష్టం కూడా ఉంటుందని. వెలుగు ఉంటే వెనక నీడ కూడా ఉంటుందిగదా! మరొకటి - మనకు గులాబిపువ్వు కావాలంటే ముళ్ళబాధకు సిద్ధపడి ఉండాలి. అలాగే కష్టపడితే గాని సుఖం పొందడం సాధ్యం కాదని, ఎంతో కష్టాలకు ఓర్చి శ్రమ పడితేనే గాని సత్ఫలితాలు లభించవు. మేడం క్యూరీ మిక్కిలి విలువైన రేడియం కనిపెట్టడానికి ఎన్ని సంవత్సరాలు ఎలా శ్రమపడినదీ ఆమె జీవితచరిత్ర ఎరిగినవారికి బాగా తెలుస్తుంది.

మనం ఎంతో శ్రమ పడితేనే గాని ఫలం లభించదు "కష్టే ఫలీ" అనే నానుడి యిందు మూలంగానే ఏర్పడినది.

మహాత్ములెప్పుడూ స్వార్థం విడిచి, యితరులకోసం ఎన్నో శ్రమలు సహిస్తారు. ప్రత్యక్ష భగవానుడైన సూర్యుడు తాను మండిపోతూనే లోకాలకు వేడిమినీ, వెలుగునూ ప్రసాదిస్తున్నాడు. అతడు లేకపోతే ప్రపంచంలో ఏ ప్రాణి జీవించి ఉండదు.

పూర్వపు రాజులకు మంత్రులు మహర్షులే. వారు రాజభవనాల్లో కూర్చోక అడవులలో ఉండే లోకహితార్థం తపస్సు చేస్తూ, అవసరమైనపుడు రాజులదగ్గరకు వచ్చేవారు. వారికి స్వార్థం అణు మాత్రం లేదు. అడవులలో నివసిస్తూనే లోకహితం కోరి ఆయా విషయాలకు సంబంధించిన సూత్రగ్రంథాలూ, శాస్త్రాలూ, పురాణాలు వ్రాశారు.

మునులవరకూ ఎందుకూ? భారతదేశానికి స్వాతంత్ర్యం సంపాదించడానికి గాంధీ మహాత్ముడు ఎట్టి శ్రమలను సహించాడో చాలామందికి తెలియును. చివరకు మోకాలు దిగని అంగవస్త్రం కట్టుకుని, తుండుగుడ్డ కప్పుకుని అతిశీతల దేశమైన ఇంగ్లాండుకు సంప్రతింపులకు రౌండుటేబిల్ కాన్ఫరెన్సుకు వెళ్ళాడంటే ఆయన బాధా సహిష్ణుత గ్రహించవచ్చును. ఎందుకోసం? తనకోసం కాదు. ఆయన శ్రమలు పడీ, పడీ స్వరాజ్యం సాధించాడు.

మనం పుస్తకాలవల్ల తెలుసుకునే విషయాలకంటే అనుభవం వల్ల ఎన్నో విషయాలు నేర్చుకోగలం, ప్రకృతి ఎన్నో పాఠాలు బోధిస్తుంది కష్టం వెంట సుఖం ఉంటుందనీ, శ్రమ పడితేనే కాని ఏ పనీ సాధ్యం కాదనిన్నీ. అలసభావం ఉన్నవారికి ఇదొక గొప్ప గుణపాఠం.

---

## హైదరాబాద్ నోట్ బుక్

ప్రదర్శనలిచ్చారు. సహజ కవి అయిన విజయ్ సంగీత సాధనలో వాగ్గేయ కారుడయ్యాడు. ఆయన 1945 లో ఆకాశవాణిలో చేరారు. పదమూడు సంవత్సరాలు పనిచేశారు. 1958 లో ఫిల్మ్స్ డివిజన్‌లో అసిస్టెంట్ మ్యూజిక్ డైరెక్టరుగా చేరారు. 1962 లో డైరెక్టరయ్యారు. ఆయన రేడియోలోను, ఫిలిములలోను రచించిన గేయాలు గొప్పవిగా వినుతి పొంది, ఉన్నతోన్నత బహుమతులు పొందాయి. ప్రమోద్ పాట్ ఎక్స్‌ప్లోరర్, ఇండియా మై డ్రీం అనే వార్తా చిత్రాలకు, ఎం. ఎఫ్. హుస్సేన్ త్రూది ఐస్ ఆఫ్ పెయింటర్ వార్తా చిత్రానికి, మరికొన్ని వార్తా చిత్రాలకు ఆయన కూర్చిన సంగీతం ప్రపంచ రసికుల మెప్పు పొందింది. ఎం. ఎఫ్. హుస్సేన్ చిత్రానికి కూర్చిన సంగీతానికి బెర్లిన్‌లో బంగారు భల్లూకం అవార్డు లభించింది. మరెన్నో అవార్డులు ఆయనను వరించాయి. 1970 లో భారత ప్రభుత్వం ఆయనను పద్మశ్రీ బిరుదంతో గౌరవించింది. 1974 లో సంగీత కళా శిరోమణి బిరుదం పొందారు. కెనడా

ప్రముఖ ఫిలిం, టెలివిజన్ చిత్ర నిర్మాత జేమ్స్ బెవెరిడ్జ్ విజయ్ జీవితం, సంగీత కళాసేవ వస్తువుగా వార్తా చిత్రం నిర్మించారు. విజయ్ ఆంగ్లంలో రచించిన కవితా సంపుటి "నిర్వాణ" త్వరలో ఆవిష్కరించబడుతుంది. ఇంతటి ప్రతిభావంతుడైన విజయ రాఘవరావును ఆంధ్రప్రదేశ్ సంగీత నాటక అకాడెమీ సంగీత సంగీతోత్సవాల చివరి రోజున గాన కళా ప్రపూర్ణ బిరుదంతో సత్కరించి, అకాడెమీ అధ్యక్షులు శ్రీ కె. వి. గోపాలస్వామి అన్నట్టు తననుతానే గౌరవించుకొన్నది. అకాడెమీ ఉపాధ్యక్షుడు శ్రీ మామిడిపూడి ఆనందం సన్మాన పత్రం చదివారు. కార్యదర్శి శ్రీ కె. సుబ్బారావు విజయ్ సేవను వివరించారు. శ్రీ గోపాలస్వామి బిరుద ప్రదానం చేశారు. సంయుక్త కార్యదర్శి శ్రీ బి. కృష్ణంరాజు వందన సమర్పణ చేశారు. వేణువాదన నిపుణుడైన విజయరాఘవరావు తన వేణుగానంతో శ్రోతలను ఆనందింపచేశారు. 6 వ తేదీన గవర్నర్ శ్రీ భండారే సంగీతోత్సవాలను ప్రారంభిస్తూ, దేశం సాధిస్తున్న ప్రగతిని, సామాజిక పరివర్తనను ప్రజాసామాన్యానికి తెలియజేయడంలోను, ప్రజలలో నూతన భావాల నారులు పోయడానికి సంగీతాన్ని బలమైన సాధనంగా వినియోగించవచ్చునన్నారు. అధ్యక్షత వహించిన విద్యామంత్రి శ్రీ ఎం. వి. కృష్ణారావు రాష్ట్రంలో హిందూస్తానీ సంగీత వ్యాప్తికి, సామరస్యానికి ఈ ఉత్సవాలు తోడ్పడగలవన్నారు. ఉత్సవ సంఘాధ్యక్షుడు శ్రీ మామిడిపూడి ఆనందం స్వాగతం చెప్పారు. ఉత్సవాలకు అధ్యక్షత వహించిన శ్రీ విజయ రాఘవరావు సంగీతంలో సమన్వయాన్ని గురించి ప్రసంగించారు. 18 సంవత్సరాల యువకుడు శ్రీ కార్తిక శేషాద్రి సితార్ వాద్యంతో శ్రోతల హృదయాలను ఉర్రూతలూగించారు. ప్రముఖ విద్వాంసులు పద్మారావు, ఎస్. బి. దేశపాండే, కుమార గంధర్వ, వి. జి. జోగ్, సర్వాన్ సుల్తాన్, జి. వి. సుబ్బారావు, సత్యప్రకాశ్, శ్రీమతి మాలినీ రాజూర్కర్, పండిట్ రామనారాయణ్ బృందం, గాత్ర, వేణు, సితార్ వాద్యాలతో ఆనందింపజేశారు. పక్కవాద్యాలలో షేక్‌దావూద్ తబలా, అంబా

ప్రసాద్ హార్మోనియం శ్రోతలను పరవశింపజేశాయి. 8, 9, తేదీలలో కళాభవన్‌లో సంగీత శిక్షణలో నూతన పద్ధతులపై సదస్సు జరిగింది. ప్రముఖ విద్వాంసులు శ్రీయుతులు నూకల చినసత్యనారాయణ దంతాలే, భీమశంకర రావు, రాజూర్కర్, ద్వారం భావనారాయణ, ఎస్. బి. దేశ్‌పాండే, పి. ఎల్. దేశ్‌పాండే, పద్మారావు, మున్నగువారు పాల్గొన్నారు. శ్రీ విజయ రాఘవరావు అధ్యక్షులుగా పెక్కు సూచనలు చేశారు.

**ఉపశ్రుతి :**

ఏమండీ, మీరు కూడ పాటపాడుతారా ? అనడిగాను హిందూస్తానీ సంగీత మహోత్సవంలో హడావుడిగా తిరుగుతున్న అధికార భాషా కమిషన్ ప్రత్యేకాధికారి శ్రీ గోవిందరాజు రామకృష్ణారావును "ఆ ! ఎందుకు పాడను ! కాని సంగీత సభలలో కాదు. చవగ్గా వస్తే వేలంపాట పాడుతాను" అన్నారు రామకృష్ణారావు మందహాసం చేస్తూ ●





# కాలం వేసిన కాటు

కె. కె. మీనన్



అర గంటలో బయల్దేరుతుందన్న మోటార్ లాంచి గంటన్నర క్కూడా బంధాలు విప్పుకుని బయట పళ్లేదు. ఆరు వందల మైళ్ళు నిరవధికంగా, అనాయాసంగా ప్రయాణం చేయ గల్గిన రవి ఆ ఆరుమైళ్ళు ప్రయాణం చెయ్యలేక లాంచి వాళ్ల వుచ్చులో బిగుసుకుపోయాడు. మొద టప్రయాణీకుడు లాంచిలో కాలు మోపిన క్షణం నుంచీ స్టార్టయిన ఇంజను కర్ణభేరి పగిలేలా అలా మోగుతూనే వుంది. అదో తలనొప్పి. రోజు రోజుకూ కాల దూరాలు కుంచించుకు పోతోన్న యీ సాంకేతిక యుగంలో; కాలం విలువ తెలియని వీళ్లు గంటల తరబడి గోదావరి గట్టుమీద నిలబడి ప్రయాణీకుల్ని వరించటానికి నానాతంటాలు పడుతున్నారు. వరించబడ్డ వాళ్ళని వంచిస్తూనే వున్నారు. వీళ్ళ జాతకాలెరిగిన కొంత మంది ప్రయాణీకులు మాత్రం రేవుదాటి బస్సుల్లో వెళ్ళిపోతున్నారు.

ఆ లాంచి నిండే తరుణమ్మూ, తను బతికి బయట పడే అదృష్టమూ అంత దగ్గర్లో వున్నట్టు అనిపించలెదు రవికి. అతను ఆ ప్రాంతాలకు వచ్చి రెండు మూడేళ్లయింది. ఈ రెండు మూడేళ్లలోనూ ప్రయాణ సౌకర్యాలు ఎంతగానో మెరుగు పడ్డాయి. లాంచి టాపుమీద కూర్చుని గోదావరి అలలమీద హాయిగా వూగుతో, ఆరోగ్యకరమైన గాలిని పీలుస్తో ప్రయాణం చెయ్యాలనే ప్రలోభమే అతన్ని కట్టిపోయినట్లయితే యీ పాటికి గమ్యం చేరుకుని వుండేవాడు.

ఎలాగైతే తాళ్ళు విప్పకుని తరలింది లాంచి. అలలమీద వయ్యారంగా వూగుతో రాజహంసలా ప్రయాణం చేస్తున్న లాంచి మీద కూర్చుంటే అతని మనస్సు తీయని వూహాలతో వుయ్యాలలు ఊగసాగింది. గోదావరి గాలి జోల పాడుతుంటే మనస్సు పరవశమై గత స్మృతుల స్వాప్నిక జగత్తులోకి జారిపోసాగింది.

లంకలో గడ్డి ఏపుగా పెరిగి పచ్చ కంబళి పరిచినట్లుంది. ఒడ్డున గోదావరి విరబూసిన రెల్లుపూలు తెలివెన్నెల తునకల్లా గాలిలో తేలియాడు తున్నాయి. గోదావరి గట్టునే గడ్డి మోపులు నెత్తినెట్టుకుని సాగిపోయే రైతులు గాలికి తలలు పంకిస్తున్న లేత కందిచేలూ- నదీ— వీటిలో ముడిపడ్డ తన జీవితం ఒట్టి స్మృతులుగానే మిగిలిపోయాయి రవికి. ఆ పరిసరాల్నూ, ప్రకృతి సౌందర్యం చూడ్డానికి మాత్రమె ఈ ప్రయాణం చేస్తున్నానని అతను అనుకుంటే అది ఆత్మ వంచనే. ఎంచేతనంటే అతను ఇంతదూరం, ఇన్ని ఇక్కట్లనూ అధిగమించి ఎవరికోసమైతే వెళ్తున్నాడో; 'ఆ వ్యక్తి వూళ్ళో లేకపోతే ?' అనే అనుమానం కలిగినప్పుడు అతను మానసికంగా పొందే కుదుపూ, నిరుత్సాహమూ అందుకు దృష్టాంతం.

సీత అంటే ఎందుకో అతనికంత ప్రేమ! ఛఛ ... అది ప్రేమకాదు. వాంఛ. లేకపోతే మోహం. సీత రాఘవను పెళ్లి చేసుకుంటా నన్నప్పుడు — తను అనుభవించిన ఆమె యవ్వనమ్మూ, కాకతాళీయంగానైనా ఒకసారి తన కౌగిట్లో నలిగిన ఆమె దేహమూ రాఘవ పరం అవుతున్నాయనే ఈర్ష్య జుగుప్స తప్ప అతన్లో ఏలాంటి సంచ

లనమూ కలగలేదు.

సీతకు పెళ్లయి సంసారం చేసుకుంటోంది. అయినా ఇంకా ఆమెను అనుభవించాలనే తాపత్రయం ఎందుకో అతనికే అర్థం కాదు. ఇప్పుడు తనున్న హోదాలో ఎందర్నో అందమైన స్త్రీలని అనుభవించ వచ్చు. పెళ్ళి చేసుకోవాలన్నా సీతకన్నా సౌందర్యవంతులు కోకొల్లలు. అందుకు అనూహ్యాతంగానే ముందుకు వస్తున్నవాళ్ళు అనేకమంది వున్నారు. కాని మనస్సు అంగీకరించదు. కారణం ? అందరూ శిలాన్ని కోల్పోయినట్టే కన్పిస్తారు అతని దృష్టికి.

సీతకు దిక్కులేని దశలో, కట్ట బట్టా పొట్టనిండా తిండీ లేని రోజుల్లో తన్ను కాలేజీనుంచి వచ్చేప్పుడు తెచ్చే చీరలూ అలంకరణ సామగ్రీ అందుకుంటూ చూసే చూపుల్లోని కృతజ్ఞత, పసిగట్టి, అలాంటి చర్యల ద్వారా ఆమెను వశపర్చుకోటానికి ప్రయత్నించేవాడు. ఎప్పుడూ లేమిలో బతికే వాళ్ల విషయం వేరు. ఒకప్పుడు బాగా బతికి కన్నవాళ్లతోబాటే ఆస్తిపాస్తుల్ని పోగొట్టుకుని కేవలం రవినాన్న ఇస్తున్న అద్దె సొమ్ములోనే బతుకు నెట్టుకొస్తున్న సీత లాంటి వాళ్ళకి, వెనకటి బతుకు వాసనల్ని గుర్తింపచేసే అలాంటి బహుమతులు తప్పక లొంగదీసుకుంటాయి. అందుకేనేమో! త్రికరణ శుద్ధిగా తనబావ రాఘవనే ప్రేమించి, అతని కోసమే దాచుకుంటున్న యవ్వనాన్ని ప్రాణప్రదంగా ఎంచుకుంటున్న శీలాన్ని అతను కోరినప్పుడు తిరస్కరించలేకపోయింది. రాజమండ్రిలో టీచర్ ట్రెయినింగ్ చదువుతోన్న రాఘవ, అవకాశాలు వున్నా అవివాహితులుగా దైహిక వాంఛలకు లొంగరాదనే దైహిక బంధాలతో కోర్కెల కంతాలు బిగించే రాఘవ ఆమెను తల్చుకుంటూ అక్కడ బంగారు కలలు కంటున్న వేళలో అతను దాచుకున్న ఆమెలోని సర్వస్వాన్నీ దోచుకున్నాడు. అంతా అయినాక చుక్కల రెక్కలు విరిగినట్లూ స్వర్గం లూటి పడుతున్నట్లూ మూగగా ఏడుస్తూన్న ఆమెని పట్టించుకోకుండా ఏదో పట్టనట్టే కాలెజీకి పారిపోయాడు.

రవి లాంచీ దిగి ఊరువైపు నడవసాగాడు. పోయినసారి అతను ఆ వూరు అదిరే గుండెలతో అనుమానాలతో వెళ్లేడు. రాఘవకు తను చేసిన ద్రోహం తెల్సిందేమో! సీత తనని చీత్కారం చేస్తుందేమో! కాని అప్పుడంతా తన వూహలకి వ్యతిరేకంగా జరిగింది. రాఘవ ఎంతో ఆప్యాయంగా ఆదరించాడు. సీత అడిగినప్పుడల్లా అభ్యంతరం చెప్పకుండా కౌగిలిలో వాలింది. ఇవన్నీ ఆనాడు అతనికి ఆమె వైవాహిక జీవితం మీద అనేక అనుమానాలు రేపాయి. కాని అవన్నీ ఒట్టి అనుమానాలు మాత్రమేనని చెంపదెబ్బ కొట్టినట్లు చెప్పింది.

'ఆ విషయంలో బావ నీ కంటే ఎన్నో రెట్లు నయం' అంది.

*        *        *

రవి ఆ యింటి ఆవరణలోకి అడుగు పెట్టేప్పటికి సీత ముందువా వరండాలో కూర్చుని బియ్యం ఏరుకుంటోంది. పది మంది పిల్లలు ఎక్కాలు వల్లె వేస్తున్నారు. అప్పుడప్పుడూ వాళ్ళ తప్పులు చదువుతూంటే ఆమె సరి చేస్తోంది.

ఒకనాటి ఆ యింటి వైభవానికి గుర్తుగా రెండు గదులు మిగిలి వున్నాయి, ఆ యింటి వారసురాలు సీత దైన్యానికి ప్రతీకగా కూలిన గోడల శిథిలాలూ, అస్తవ్యస్తంగా పడివున్న ఇటికలూ వున్నాయి.

రవి ఒక ఇటికల గుట్టమీద కాలేసి పడబోయి సీత దృష్టిలో పడ్డాడు.

## నిన్న - నేడు - రేపు

గతం జ్ఞాపకాల స్వగతం
గతించిన కాలం అమృతం
భూతమే అయినా అభయం
అనుభూతుల కది వరం !

వర్తమానం సమస్యల తోరణం
ఉన్నవాడికి వెన్నుమీద రణం
లేనివాడి కది జీవన్మరణం
నిరాశా నిస్పృహలకు నిలయం !

భావి ఒక బంగారు పూదోటంటూ
భావించే వారందరికి ఒకమాట
అందరికీ అందులో చోటుండదు
అయినా ఆశ దానిపై చావదు !

గతానిదే ఎప్పుడూ గెలుపు
వర్తమానంలో అది మెరుపు
భవిష్యత్తుపై అది జల్లే మత్తు
'భూతం' చేతిలో అవుతుంది చిత్తు !

— మాధవ్

'రా రవి ! ఏన్నాళ్ళకి. మే మింకా గుర్తున్నామన్న మాట!'

'వచ్చిన వాడికి కాసిని మంచినీళ్లయినా ఇవ్వకుండా ఏమిటి దెప్పి పొడుపులు?' అన్నాడు నవ్వుతూ.

'ఓస్. మంచినీళ్ళేగదా! అవి కరువయ్యే రోజులు ఇంకా రాలేదులే!' అని 'ఊ...ఇంతకీ ఎక్కడ్నుంచి రావటం?' అనడిగింది పక్కనున్న ముక్కాలి పీట అతనికి వేస్తూ. పీట వేస్తున్నప్పుడు పైట జారి హైన్యంగా ఒంటిని పట్టుకు వేళ్ళాడుతున్న చింకి జాకెట్టు ఆమె దరిద్రానికి అద్దం పట్టింది. ఆమె ఎంత జాగ్రత్తగా వున్నా ఆ ప్రమాదం తప్పింది కాదు.

'పిల్లలూ మీరిక వెళ్ళిపోండి.'

వాళ్ళంతా బిలబిల మంటూ వెళ్ళిపోయారు.

'ఎవరు సీతా వీళ్లంతా?'

"నా శిష్యులు. బతుకు తెరువు కోసం ఈ పని మొదలెట్టాను. ఏదో బట్టకు మిగలకపోయినా పొట్టకు సరిపోతోంది."

ఆ విషయం అప్పటికే అర్థం అయింది రవికి. టాపిక్ మార్చి,

"రాఘవ ఇంకా స్కూలు నించి రాలేదా?" అనడిగాడు.

లోపల్నుంచి దగ్గు విన్పిస్తే అతనికి జవాబు చెప్పకుండగనే లోపలికి పరుగెట్టింది సీత.

ఆమె వెనకాలే వెళ్ళేడు రవి.

అతని ప్రశ్నకి జవాబుగా రాఘవ అస్థిపంజరంలా మంచంలో కనిపించాడు. విపరీతమైన దగ్గువల్ల అతని కను గుంటల్లో నీళ్ళు నిలిచేయి. సీత అతన్ని పొదివి పట్టుకుని కూర్చుంది. దగ్గి దగ్గి ఆయాసంతో పక్కకి ఒరిగాడు రాఘవ.

"ఏమైంది రాఘవా?" అంటూ మంచం మీద కూర్చున్నాడు రవి. ఆ మంచం మీది బట్టలు మాసి మురికి కంపు కొడుతున్నాయి పక్కనే ఉమ్ముకోటానికి మట్టి పాత్రలో ఇసక వుంది.

"ఎప్పుడొచ్చావు రవీ ..." అని పలకరించాడు నీర్సంగా,

"ఇప్పుడే వచ్చాను. ఏందుకిలా అయిపోయావు ?"

అంతా ఖర్మ అన్నట్లు నుదురు కొట్టుకున్నాడు.

సీత లేచి అవతలి గదిలోకి వెళ్ళిపోయింది.

## కాలం వేసిన కాటు

"ఈ పల్లెటూళ్లో నీకు మంచి వైద్యం దొరకదు. నాతో రాకూడదా రాఘవా."

రాఘవ పేలవంగా నవ్వాడు.

"నన్ను బతకమని సలహాఇస్తున్నావారవీ."

ఆ మాటలు రవి గుండెల్లో కలుక్కుమన్నాయి. మరి మాట్లాడలేదు.

"రవీ! నిన్నో సహాయం అడగనా?"

"తప్పకుండా అడుగు రాఘవా"

రాఘవ నిట్టూర్చి!

"నేనెలాగూ చచ్చిపోవటం ఖాయం రవీ. నన్ను నమ్ముకుని సర్వనాశనమై పోయిన సీత గురించే నాకు బెంగగా వుంది. నేను చచ్చిపోతే సీతని పెళ్లి చేసుకుంటావా రవీ."

ఒకప్పుడు సీతను తనలో తలచి ఒప్పేయ్యమన్నాడు రవి. కాని, ఇప్పుడు ఆమె భర్త పెళ్లి చేసుకుంటావా అని అడిగిన ప్రశ్నకు సమాధానం చెప్పలేక అవతల గదిలోకి పారిపోయాడు.

అక్కడ సీత ఒక మూలగా కూర్చుని ఏడుస్తోంది.

'సీతా'

ఆమె కళ్లు తుడుచుకుని నిలబడింది.

'ఇక్కడికి ఎందుకొచ్చావు రవీ. వెళ్లిపో. నేను ఒంటరిగా ఉన్నప్పుడు ఎప్పుడూ నాతో మాట్లాడకు.'

'అది కాదు సీతా! రాఘవ బతకడని అధైర్య పడుతున్నాడు. మీ రిద్దరూ నా దగ్గరికి రాకూడదా హాస్పిటల్లో చేర్పిస్తాను.'

'నేనింకా బతికే వున్నాను రవీ! నేను బతికి వున్నంత కాలం బావ నన్ను విశ్వసించడు.'

'ఎప్పట్నుంచి సీతా ఈ రోగం?'

'నేను పతివ్రతను కాదని తెల్సినప్పట్నుంచీ.'

'ఎలా తెల్సింది?'

'నా మీద ప్రయోగించే నీ సాహితీ ప్రతిభ అతని కంట పడకుండా వుంటుందా?'

రాఘవ విపరీతంగా దగ్గుతున్నాడు. ఇద్దరూ పరుగెత్తారు. రాఘవ పక్కంతా నెత్తురుతో తడిసి పోయింది. సీతను దగ్గరికి రావద్దని సైగ చేశాడు. ఆమె కళ్లముందే రెండు రక్తవాంతులు చేసుకున్నాడు. అతన్లో మిగిలివున్న శక్తంతా నెత్తురై బైటికి వస్తోంది.

సీత వెక్కి వెక్కి ఏడుస్తోంది.

'ఎందుకు సీతా ఏడుస్తావ్?' దగ్గరికెళ్ల బోయాడు రవి.

'చూస్తున్నావు కదూ రవీ నువ్వు నాకు విధించిన శిక్ష' అంది.

రవి ఆగిపోయాడు.

'వెళ్లిపో. తక్షణం ఇక్కడ్నుంచి వెళ్లిపో రవీ...వెళ్లిపో' గట్టిగా అరిచి కింద పడి పోయింది.

ఆమె పడిపోతే సపర్యలు చేయాలనేవూహ కలగలేదు.

సీత కోసం తెచ్చిన చీరలూ, పళ్లూ అక్కడే వదిలేసి బయటికి వచ్చేశాడు. కాదు... తను చేసిన పాపం, పాపం, ఆ రెండు ప్రాణాల్ని నిర్దాక్షిణ్యంగా కాటేస్తుంటే చూసి భయపడి పారిపోయేడు.

# డాక్టరు సలహాలు

**డాక్టర్ కె. వెంకటేశ్వరరావు**

**వై. వి. పి. బి. — సింహాచలం**

నా స్నేహితునికి 20 సం.ల వయస్సు ఏదో ఎప్పుడూ బాధపడుతూ ఉన్నట్లు ఉంటాడు. అడిగితే "నాకు అందరితో కలిసి తిరగాలనేవున్నా ఎందుకో పదిమంది మధ్యలో తిరగలేక పోతున్నాను. ఎవరితోనైనామాట్లాడితే జంకువస్తుంది బలవంతంగా మాట్లాడిస్తే నేను వారి ముఖం చూసి మాట్లాడలేను"అని అంటాడు. దీనికి ఏదైనా నివారణోపాయం ఉన్నదా?

ఈ లక్షణాలనే వ్యావహారికంగా అందరూ "ఇన్‌ఫీరియారిటీ కాంప్లెక్స్"అంటారు. మానసిక బలహీనతవల్ల ఆత్మన్యూనత, అందరినీ తమవైపు ఆకట్టుకోవాలనే ఆకాంక్షతో చేయబోయిన పనులు ఎదురుతిరిగితే జరిగే మానసిక సంఘర్షణ మొదలయినవన్నీ మనిషిలో "డిప్రెసివ్ స్టేట్స్" (మందకొండితనాలు)లను కలుగజేస్తాయి. పుండుమీదకారం చల్లినట్లుగా, తోటివారు, వీరిలోని ఈ బలహీనతను గురించి మాట్లాడటం ఎగతాళి చేయటం ఈ"రోగాన్ని", మరింత బలపరుస్తాయి.

దీని నివారణకు మందులకన్నా వీరికిధైర్యం కలిగేవిధంగా మాట్లాడగలవారు, వారికి తోడనీడగా ఉంటూ వంటరితనం లేకుండా చూసుకొనగలిగేవారు, అతనిలో ఏ లోపం లేనట్లుగా సలహాలచేత ప్రవర్తింపచేసేవారు, తగినంతప్రోత్సాహ సహకారాలందజేసే స్నేహితులు, ఆప్తులు అధికంగా ఉపయోగపడతారు. ఏదో"రోగం"గా ఈ లక్షణాలన్నీ చూడటం వీరికి మరింత హానికరం.

**జి. వి. యస్. — హొస్‌పేట.**

నా వయస్సు 20 సం. లు. నాకు 7 మాసములుగా రోజూ జలుబుగా వుంటుంది. ముక్కు నుండి తెల్లని గడ్డలు పడతాయి. ఒక మారు నాటు మందు వాడినాను. ముక్కులో దురదగా వుంటుంది. తుమ్ములు ఎక్కువగా వస్తాయి.

ప్రతి నిత్యం "జలుబు" 7 నెలలుగా ఉంటే, అది శరీరంలోని రోగనిరోధక శక్తి తగ్గి పోవటాన్ని శరీరానికి కొన్ని ఆహార సంబంధమైనటువంటివి, లేక వాతావరణంలోని గాలి, తదితర వస్తువులు మొదలయినటువంటివి, "పడక" [శరీరానికి హానికరంగా మారేవి అయితే] పోవటాన్ని తెలియజేస్తుంది.

ఇలా రావటాన్ని "క్రానిక్ పెరాక్సిస్ మల్ రైనోరియా అంటారు. ఇలా ఉండే వారికి ఇ. ఎన్. టి. వైద్యులు పరీక్షానంతరం శరీరానికి పడనివాటిని మీతో సంప్రదించి, కనుగొని వాటిని కొద్ది కొద్దిగా శరీరానికి హానికరం కాని విధంగా అలవాటు చేయడమో లేక కొన్ని వాక్సిన్ల ద్వారా ఈ రోగ నిరోధక శక్తిని పెంచటమో చేస్తారు. కొందరికి మాత్రం— "ఎలక్ట్రికల్ కాటరైజేషన్ అంటే ముక్కులోపలి పొరలో ఉన్న గ్రంథులను కరెంట్ తీగల ద్వారా పనిచేయలేని పరిస్థితి ఏర్పరచడం అవసరమవుతుంది.

**ఎం. ఎస్. ఆర్. వనపర్తి**

నాకు దాదాపు 2 సంవత్సరాల క్రితం సైకిల్ సీటువద్ద ఉండే ఇనుపకడ్డీ వృషణాలకి, ఆసనానికి మధ్య తగిలింది. అప్పటినుండి నావృషణాలు చిన్నవిగా అవుతున్నాయి. ఇది చాలాచిన్నవవటం, పురుషాంగం చిన్నదవటంవల్ల దాంపత్య జీవితానికి ఆటంకం ఏదైనా ఉందా? పిల్లలు కలిగే అవకాశం ఉందా??

పై విషయాలకి జవాబు మీ "సెమెన్ అనాలిసిస్"ని బట్టి చెప్పవలసిందేగాని, వృషణాలు, జననాంగం చిన్నవయినంతమాత్రాన పిల్లలు కలుగుతారో లేదో అని జోస్యం చెప్పడాన్ని వైద్య శాస్త్రం అంగీకరించదు. మీరు దాంపత్య జీవితంలో ఏర్పడుతుందనుకునే "ఆటంకం" మీరు వ్రాసిన కారణాలమీద మాత్రమేగాక ఎన్నో ఇతర విషయాలవల్ల ఏర్పడవచ్చును. అదేవిధంగా మీరు వ్రాసినవి "ఆటంకాలే" కాకపోవచ్చు కూడా.



**ఎల్. వి. తాడిపత్రి**

నాకు వివాహమయి 4 నెలలు అయినది. రెండవ నెలనుంచి గర్భనిరోధక మాత్రలు వాడుతున్నాను. ఒక బుతుక్రమంలో ఒకరోజు మరచిపోవటం మూలాన "విత్‌డ్రాయల్ బ్లీడింగ్" వచ్చింది తర్వాత వచ్చిన బుతుక్రమాలు ఆలశ్యం అవటం, కొద్దిగా కొన్ని రోజులే అవడం జరుగుతున్నది. ఈ మాత్రలు వాడకుండా కనీసం 2 సంవత్సరాలు పిల్లలు కలుగకుండా చూసుకొనే విధానం ఉందా ??

మీకు ఈ "ఒరల్ కాంట్రా సెప్టివ్' మాత్రలు పడకపోవటంవల్ల, అదీగాక "క్రొత్తగా" వివాహమయినందువల్ల (మీవారు) అనుసరించ తగ్గ పద్ధతి నిరోధ్ వాడకమే ! మీ పరిస్థితిలో "లూప్" వేయరు ఆపరేషన్ ప్రశ్నేలేదు. ! కాబట్టి "నిరోధ్" మీరు పిల్లలువద్దను కొన్నంత కాలం వాడండి.

**వి. ఎన్. ఎమ్ - మీన విల్లూరు.**

మా ఆడపడుచు వయస్సు 19సం.లు. నాలుగు ఏళ్లనుండి గజ్జలో ఎదురుపాము వేసి చలిజ్వరము వచ్చుచున్నది. చలిజ్వరము తగ్గి, ఎదురుపాముబిళ్ళ క్రిందికి దిగి కాలు వాయుచున్నది. మందులు వాడినప్పుడు తగ్గి మరల సంవత్సరము పూర్తి అయ్యేసరికి మరల వచ్చుచున్నది. దీనికి ఏమిచెయ్య మంటారు?

పై లక్షణాలన్నీ "ఫైలేరియా" అనే రోగాన్ని తెలియజేస్తున్నాయి. కాలు వాయటం ఈ రోగం ముదిరినట్లు సూచించే "బోదకాలు" యొక్క ప్రథమదశ.

దీనికి మాడిబాన్ మాత్రలు లేక సల్ఫాడయజీన్ మాత్రలు రోజుకి ఆరు [పూటకి రెండుగా 3 పూటలు] వరుసగా ఒక వారం పాటు హెట్రజాన్ మాత్రలు రోజుకి 6 (పూటకి 2 వంతున) 10 రోజులు తీసుకోవటం వల్ల ఆ రోగం యింతకు మించి పెరగదు.

**ఎమ్. వి. వి. - షోలాపూర్.**

నా వయస్సు 19 సం.లు. మెడ వద్ద వెన్ను పూస ఒక సంవత్సరముగా నొప్పిగా వుంటోంది. బలమైన ఆహారం తీసుకుంటున్నా తగ్గలేదు. దీన్ని ఏమంటారు? నివారణోపాయమేమిటి?

మీరు మెడ, "ఎక్స్—రే —నెక్" ఎ.పి. అండ్ లాటెరల్, వ్యూప్ తీయించి, తగినవైద్యులకు చూపిస్తే, ఆ వెన్నుపూసలోని లోపం తెలుస్తుంది. లోపాన్ని బట్టి రోగ నివారణ నిర్ణయించాలి. "టి.బి." అని నిర్ణయింపబడితే— అప్పుడు బలమైన ఆహారం తీసుకోవటం సంగతి వస్తుంది.

**ఎన్. ఎన్. ఆర్. - హైదరాబాదు-29**

మావారి వయస్సు 37 సంవత్సరాలు 10—12 సంవత్సరాలుగా వారి ఛాతీపై భాగంలో (చొక్కా మొదటి బటన్ ఉండే ప్రాంతంలో) చర్మంమీద కండ పెరగటం ప్రారంభించి ఇప్పటికి 2 అంగుళాల మేరకు పెరిగింది. ఇక్కడ వైద్యులు దాన్ని కీలాయిడ్ అని, ఆపరేషన్‌చేసినా మళ్ళీ పెరిగే అవకాశం ఉందనీ అన్నారు. ఇదేమీ ప్రమాదం అయినది. కాదుగదా ? ఆపరేషన్ చేయించడం మంచిదేనా ? అసలు దీనికి క్యూర్ ఇక్కడ ఉందా ?

మీ వైద్యుల అభిప్రాయం, సలహా సరి

కార్టూన్లు పంపేవారు స్వంత చిరునామా గల స్టాంపులతికించిన కవరుకూడా పంపడం మంచిది. సం.





## డాక్టర్ సలహాలు

అయినదే. దీనివల్ల ఏ మాత్రం నెప్పిగాని, మరే యిబ్బందిగాని, అందరూ చూడగలిగే ప్రదేశంలో ఉండటం వల్ల ఒకవేళ సిగ్గు అసహ్యం కలిగించేదిగానూ లేనప్పుడు నిద్రపోయే సింహాన్ని లేపి అపాయంకొని తెచ్చుకొన్నట్లే అవుతుందిగా! దీనికి ఇతర మార్గాలవల్ల నయమయ్యే అవకాశంలేదనే చెప్పాలి. ఎందుకంటే ఈ కీలాయిడ్స్ రావటం అనేవి వ్యక్తుల శారీరక తత్వాన్ని అనుసరించి ఉంటుంది. ఏ పద్ధతివల్ల వీటిని తొలగించినా ఉన్నదానికన్నా తిరిగి పెద్దదిగా తయారయ్యే ప్రమాదం ఉంది.

సి. హెచ్. సి. ఏలూరు

నాకు పైపెదవి పైన, చెంపలమీదా రోమములు వస్తున్నవి. నలుగు పెట్టుకున్నా ఊడటం లేదు. డిస్ట్రాయిర్ లాంటివి వాడితే రోమములు తిరిగి మొలిచే అవకాశం వున్నదంటున్నారు. దీనికి ఏం చెయ్యాలి?

రోమాలు ఎక్కువగా — అంటే మమూలుగా బయటకు కనపడే విధంగా ఉండని ప్రదేశాలలో ఏర్పడటం శారీరక తత్వాన్నిబట్టి అంటే— వాటి ఉత్పత్తి—పెరుగుదల మొదలయిన వాటిని నిర్ణయించే హార్మోనుల ఉత్పత్తి శరీరంలో జరిగే ప్రమాణాన్ని బట్టి ఉంటుంది. మగవారికి సహజమైన "టెస్టోస్టిరోన్ ఆడవారిలోనూ, ఆడవారికి సహజమైన "ఈస్ట్రోజెన్ ప్రొజెస్టిరాన్ మగవారిలోను సహజంగానే ఉంటాయి. కాని వాటి మోతాదులు తారుమారైనప్పుడు ఆడవారికి మగలక్షణాలు, మగవారికి ఆడలక్షణాలు ఏర్పడతాయి!. ●




నేను గీచిన 'కోతి' చిత్రానికి బహుమతి-రావటానికి కారణం నువ్వే సుజాతా! ఇందులో నా గొప్పతనం ఏమీ లేదు – ఆ వేళ నువ్వు నా ఎదురుగా కూర్చొబెట్టే ఆ చిత్రం అంత బాగా గియ్యగలిగా తెలుసా !!

## అట్టమీద బొమ్మ

7.1.77 తేదీన వెలువడిన మా(మీ) ఆంధ్ర పత్రిక పై శ్రీ నాగేశ్వరరావుగారి ముఖ చిత్రం అత్యంత ఆకర్షణీయంగా యుంది. 'హో తారకథ' చాల చక్కగా నడుస్తుంది. 'కలకాలము నిలచిన ఒక ప్రేమకథ' చాలా బాగుంది. అందులో రత్న పాత్ర 'వసుంధర'గారు చాలా చక్కగా పోషించరు.

సిహెచ్. రామారావు. బి. సంజీవరావు. టి. శ్రీకృష్ణమూర్తి. (విజయనగరము.)

* * *

4.1.77 తేదీన వెలువడిన మీ(మా) ఆంధ్ర సచిత్ర వారపత్రిక ముఖచిత్రం రమణీయంగా యున్నది. ముఖచిత్రం చూచి ఈ ఉత్తరము వ్రాయకుండా ఉండలేక పోయాను. ఈ సంచికలో 'పద్మావతి విలాస్' కథ నచ్చింది. మీరు సీరియల్‌గా ప్రచురిస్తున్న 'హో తారకథ' చాలా ఆసక్తికరంగా యుంది.

చెళ్ళపిళ్ల గౌరీశంకర్, (అనకాపల్లి)

* * *

14.1.77 వ ఆంధ్ర సచిత్ర వార పత్రిక సంక్రాంతి ముఖ చిత్రం చాల బాగుంది. 'హో తార కథ, మూగదిక్కు, సీరియల్స్ చాలా బాగున్నాయి. యింక పోతే వి.వి. రమణరావు గారి పద్మావతీవిలాస్ కథ చాలా బాగుంది. సినిమా వార్తలు శ్రీనివాస్‌గారు చలా బాగా అందించారు. రామలక్ష్మిగారి 'జవాబులు చల కరుకుగా ఉన్నాయి.

రవీంద్రభారతి, (అనంతపురము.)

* * *

## ఉత్తరాలు

(4వ పేజీ తరువాయి)

వినూత్న శోభతో, అందాల హరివిల్లులు జల్లుతూ వారం ముందుగానే సంక్రాంతిని మాతో పంచుకోవాలన్నట్లు అందమైన ముఖచిత్రంతో సాక్షాత్కరించింది. సంక్రాంతి సంచిక ఆంధ్రసచిత్రవారపత్రిక. చదవడానికి పెద్దవి కాకపోయినా—తప్పక చదివితీరాలి అన్నంత ఉత్సుకతతో పయనిస్తూ మంచి 'నీతిని' అందిస్తున్నాయి మా పత్రిక అందిస్తున్న కథలు.

ముఖ్యంగా ఈ వారం (14.1.77) ప్రచురితమైన 'పట్నం బస్సు' కథ కులవృత్తిని అవమానపర్చుకునే వారికి చెంపపెట్టు. అయితే 'బియ్యే చదివిన మోచోడి కొడుకుతో కూడా 'ఛాష భాష మాట్లాడించి ఆ పాత్రకు కొంత 'ఎబ్బెట్టుతనాన్ని ప్రసాదించారు రచయితగారు.

'సృష్టి 'తెనుగు వారెక్కడ? అన్న కథ తెలుగు సాహితీ క్షేత్రంలో నూతన ప్రయోగాలుగా భావించవచ్చు.

కె. మల్లేష్, (బెల్లంపల్లి.)

## ప్రకటన

1977 తెలుగు సంవత్సరాది శుభసందర్భంగా శ్రీ రాజావాణీ సాహితీ నిలయం 'మాణిక్యదీపిక' అను 100పేజీల కథలసంపుటి ప్రచురింప దలచి నది. ఉత్సాహవంతులైన యువ రచయిత్[రు] లనుండి రచనలు ఆహ్వానింపబడుచున్నాము. పూర్తి వివరాలకు సొంత అడ్రసుగల కవరుతో ఈ క్రింది చిరునామాకు రాయుండి.

డైరెక్టర్: శ్రీ రాజావాణీ సాహితీ నిలయమ్, మహానంది P.O. నంద్యాల తాలూకా, కర్నూలు జిల్లా.





## అవీ - ఇవీ - అన్నీ

**శిఖరాలు**

కవితాసంపుటి. రచన: శ్రీ పోతుకూచి సాంబ శివరావు. 64 పేజీలు, వెల 3 రూపాయలు. ప్రతులకు: విశ్వసాహితి, 208, ప్యాబోంగుగూడ సికింద్రాబాదు.

**సిద్ధార్థుడు ఎందుకు పరివ్రాజకుడైనాడు ?**

ఆంగ్లమూలం డా. అంబేద్కర్, తెలుగు అను వాదం. శ్రీ బి.హెచ్. తిరుపతి. 46 పేజీలు, వెల రూపాయిన్నర. ప్రతులకు డా. అంబేద్కర్ మెమో రియల్ సొసైటీ, 32, అంబేద్కర్ నగర్, హైదరా బాదు—500267.

**సాంబశివానంద లహరి**

ఉత్పలమాల శతకం. రచన శ్రీ పోతుకూచిసాంబ శివరావు, 20 పేజీలు. వెల 1 రూపాయి. ప్రతు లకు: పోతుకూచి ఏజన్సీస్, 208, ప్యాబోంగు గూడ, సికింద్రాబాదు—3.

**వ్యాసపద్మం**

వ్యాస సంపుటి. రచన: శ్రీమతి ఆదవికొలను పార్వతి. 132 పేజీలు, వెల రు. 6.50 ప్రతు లకు: రచయిత్రి పేర ఆపర్ణా పబ్లికేషన్స్, గాంధి నగరం, కాకినాడ—4.




**Printed and Published by S. NageswaraRao at the Andhra Patrika press, MallikarjunaRao Street. Gandhinagar, Vijayawada-3. Editor: S. Radhakrishna**



# వాయువేగముతో సవారిచేయండి ఆనందంగా విహరించండి.

# హింద్ స్పీడ్‌కింగ్

భారతదేశంలో నిర్మితం. ప్రపంచమంతా చర్చితం.

బాణము లాగా దూసుకునిపోయే వేగము. తేలికైన, పలు విధమైన రంగులుగల హింద్ స్పీడ్ కింగ్, బహుశా భారతీయ వీధులపైన తిరిగే వాటిల్లో అతి వేగమైన సైకిల్. ప్రస్తుతం దీని ప్రత్యేకతలను గురించి ఒకసారి చూద్దాము.

- అందమైన మరియు అధికమైన శ్రేణికి చెందిన ఇ.ఆర్.డబ్ల్యు. స్టీల్ ఫ్రేమ్
- ప్రత్యేకముగా తయారుచేయబడిన, మెరిసే క్రోమియమ్ పూతగల హేండిల్ బార్
- సురక్షితముగా పరీక్ష చేయబడిన కేలిపెర్ బ్రేక్స్.
- 3-వేగముల షిఫ్ట్ కొరకు సదుపాయము (ఇష్టప్రకారము)

అధికమైన వేగము కొరకు ఉపయుక్తమైన పలుచని టైర్లు మరియు చక్రములు. దొంగతనమునకు ఒక ఏడాది ఉచిత బీమా. డిజిఎస్&డి రేటు కాంట్రాక్ట్ పైన ప్రభుత్వానికి, హింద్ సైకిల్స్ మాత్రమే సరఫరా చేస్తారు. రక్షణ శాఖ సిబ్బంది వారికి కాంటిన్ స్టోర్స్ ద్వారా కూడా మా సైకిల్స్ దొరుకుతాయి.



పీటన్నిటితోనూ, ప్రతివారికీ సరిపోయేలాగ ఒక హింద్ సైకిల్ ఉంది. రంగురంగుల పీటిని ఎన్నుకోండి.

హాస్టికా ● యూనిసైకిల్ ● నార్టన్ ● హింద్ ● ఎంబాసిడర్




**హింద్ సైకిల్స్ లిమిటెడ్**

(భారత ప్రభుత్వపు యాజమాన్యము)

SAA/HCL/7 TL



శ్రీ కాకతీయ పిక్చర్స్ (వరంగల్)

# చిల్లర దేవుళ్లు

దర్శకత్వం: టి. మాధవరావు
సంగీతం: కె.వి. మహదేవన్
కథ-మాటలు: దాశరథి రంగాచార్య
ఛాయ: జి.వి.ఆర్. యోగానంద్
కళ: చంద్ర

CHANDRA

డిస్ట్రిబ్యూటర్స్:
తారకరామ • శ్రీ తారకరామ • నవభారత్

LAA